# ఉత్తమ నాటిక

రసస్ఫూర్తికి నవరసాలు ఉపయోగపడతాయి. పూర్వపు కవులు శృంగారాన్ని ఉన్నత శిఖరాలకు తీసుకుపొయ్యారు. కాళిదాసు మహాకవి శాకుంతలాది నాటకాలలో శృంగార రసంలోని నవనవోన్మేషిత మాధుర్యాన్ని రసపిపాసకులకు చవిచూపాడు. భవభూతి మహాకవి "ఉత్తర రాఘవం"లో కరుణరసం, శృంగారంతో ఏమాత్రం పోటీలో ఓడిపోదనేగాక, కరుణరసమే ఉత్తమమైనదా? అను సందేహం స్ఫురింపజేశాడు సంస్కృత సాంప్రదాయాన్నిబట్టి తెలుగు భాషలో కూడ పూర్వకవులలో చాలవరకు శృంగారమే ప్రాశస్త్యం వహించింది 'కావ్యేషు నాటకం రమ్యం' కాబట్టి ఈ రస ప్రశంశ నాటక విషయంలో మరింత ప్రాముఖ్యం వహిస్తుంది.

పూర్వపు సంస్కృత నాటకాల్లోనూ, వాటిననుసరించి వ్రాసే తెలుగు నాటకాల్లోనూ ప్రధాన రసం. శృంగార, వీర, కరుణా మొదలయిన నవరసాల్లో ఒకటయిన హాస్యరసం చాల ముఖ్య స్థానాన్ని వహిస్తుంది. విదూషకుడి పాత్ర ఈ రస స్ఫూర్తికి బాగా ఉపకరిస్తుంది, ఇది ప్రేక్షక హృదయాల్లో ఆహ్లాదం కలిగించి నాటకంలోని తీవ్ర భావసంచలనా ఫలితంగా కలిగే ఆవేదనకు ఉపశాంతి కలుగజేసి, మళ్ళీ వారిని స్వస్థులుగాజేసి నాటకం నడకకు తోడ్పడే అవధిని ప్రసాదిస్తుంది. ఈ "అంతర్వాణి" నాటికలో ఇలాటిహాస్యరసమే ప్రాముఖ్యతవహిస్తుందని నానమ్మకం. పూర్వం హాస్యరసం అంత ప్రాముఖ్యంలో ఉన్నా, రాను రాను దీని ప్రాముఖ్యత తగ్గింది. ఇది ఏమాత్రము శుభ సూచకం కాదు. ఎందుచేతనంటే, హాస్యరసంలో "అంతర్వాణు"లు అనేకము న్నాయి,

ఈ సత్యం నవీన పాశ్చాత్య ప్రపంచ సారస్వతం పరిశీలిస్తే తెల్లమవుతుంది. నవీన రాజకీయరంగంలోకూడా యీ ప్రాముఖ్యత మనకు తెలుస్తుంది గొప్ప గొప్ప సమస్యలు విచిత్ర చిత్రముల(cartoons)ద్వారా ఏంతో ఆహ్లాదకరంగా, ఎంతో స్పష్టంగా, అతి సులకనగా పండిత పామరులకు వ్యక్తపడతాయి. ఇంగ్లీషు పేపర్లలో "పంచ్", "లో" అనే చిత్రకారుని చిత్రాలు ప్రతి ఆంగ్లేయునికి ఎంతో సన్నిహిత సంబంధం కలవి. ఆంగ్ల నైజ గుణ ప్రతిష్టాపనకు "పంచి" ఎంతో ముఖ్యం. ఇంత హాస్యరస ప్రాముఖ్యత మనదేశంలో లేదు. దీనికి పాశ్చాత్య, ప్రాచ్య నాగరకతా విభేదమేగాక తదితర కారణాలు కూడా ఉన్నాయి. హాస్యరసం ఉత్తమశ్రేణిలో బహిర్గతం కావాలంటే ఆ సారస్వతంలో, ఆ దేశంలో, ఆ సంఘంలో, ఉత్తమోత్తమ సంస్కారం, నైతిక ప్రాబల్యం, సాంఘిక సమత్వం, స్వతంత్రం, విశాల విజ్ఞానం, ఆర్థికపుష్టి ఉండాలి. 'హాస్యగాడనే' పాత్ర అతిసమర్థుడు. అతడే వీధినాటకాల్లోనూ, సర్కసుల్లోను ముఖ్యపాత్ర. హాస్యరసాన్ని ప్రదర్శించాలంటే అంత సమర్థత అవసరమైతే హాస్య రసాన్ని సృష్టించాలంటే ఎంత సామర్థ్యం కావాలి? స్వతంత్రం లేని బానిసకు ప్రపంచంలో హాస్యమేముంది? విజ్ఞానవిహీనునికి హాస్యం ఎక్కడ స్ఫురిస్తుంది? నైతికపటిమ లేనిచో హాస్యానికి ఆస్కారం ఎక్కడుంది? అందువల్ల హాస్యరసోత్పత్తికి, రసాస్వాదనానికి ఇంతసాధన సంపత్తి కావాలి. మనకు స్వతంత్రం లభించింది, రాజకీయరంగం దిన దినాభివృద్ధి కాంచుతుంది. సారస్వతాభివృద్ధి పొడసూపుతుంది. ఇట్టి సమయంలో ఈ హాస్యరసం ఎంతో అభివృద్ధి పొందవలసి ఉంది. రాజకీయ రంగంలో "శంకర్సు వీక్లీ" బయలుదేరింది. ఇదిఎంతో సమంజసం, ఆనందదాయకం. సారస్వతంలోకూడా ఈ రసాభివృద్ధి జరగాలి,

ఎంతమాత్రం దీనియెడలనీరసభావం తగదు. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు హాస్యరసాన్ని ఉత్తమ స్థాయిలోకి తీసుకొచ్చారు. వారితర్వాత భమిడిపాటి కామేశ్వరరావుగారు, మునిమాణిక్యంవారు ఎంతో దీన్ని నవీనంగా అభివృద్ధి చేస్తున్నారు. నాటకరంగంలోకూడా ఇది చాలా అభివృద్ధి పొందవలసియున్నది.

ఈ నాటిక హాస్యరసస్ఫూర్తిని బాగా కలిగిస్తుంది. భాషాపటిమ, భావగాంభీర్యం, రచనా చమత్కృతి, ఊహావిశేషం. ఈ నాటికలో ప్రకటితమవుతున్నాయి. ఈ గ్రంధకర్తగారు ఈనాటికను నాటకకళా పరిషత్తు ఉత్సవ సందర్భంలో ప్రదర్శించి పరిషత్తు సన్మానాన్ని చూరగొన్నారు. వీరు ముందు ముందు ఉత్తమ నాటకాలు రచించి, ప్రదర్శించి నాటక రంగానికై కృషి చేస్తారని నమ్ముతున్నాను

నూజివీడు
1—4—50

ఇట్లు
రంగయ్యప్పారావు

# ఒక మాట

ఈనాటికల్లో 'అంతర్వాణి' నా స్వతంత్ర రచన. మిగతావి కేవలం అనువాదాలు కాకపోయినా, ఆంగ్ల మాతృకలమీద ఆధారపడి వ్రాసినవే.

ఈనాటికలను వ్రాయడానికి నన్ను ప్రేరేపించింది ముఖ్యంగా నాటకకళాపరిషత్తు పోటీ ప్రదర్శనాలు. '49 జనవరిలో ఏలూరులో జరిగిన పరిషత్తు ప్రదర్శనాల్లో గుంటూరు నాట్యసమితివారు 'అంతర్వాణి' ప్రదర్శించారు. ద్వితీయ బహుమానాన్ని పొందింది 'అంతర్వాణి'!

తరువాత మిత్రుల ప్రోత్సాహం, నాటకరంగంమీద కొత్త నాటికల అవసరం మిగతా నాటికల రచనకు కారణాలయినై.

ఈ నెల కాకినాడలో జరగబోయే పరిషత్తులో విజయవాడ రాఘవ కళాక్షేత్రంవారు 'వాపస్' ప్రదర్శించబోతున్నారు.

మన తెలుగు నాటక రంగంలో యిప్పుడిప్పుడే నవ చైతన్యం కనబడుతోంది. కొత్త కొత్త ఎమెచ్యూర్ సంఘాలు బయలుదేరుతున్నాయి. కాని కావలసినన్ని కొత్త నాటకాలు రావడంలేదు. అభ్యుదయకరమైన యితివృత్తాలతో, నూతన సంవిధానంతో కొత్త నాటకాలు కావాలి. ఇందుకు రచయితలు దీక్షతో పనిజేయాలి. నాటకరంగంలో కలిగిన యీ కదలికను సార్థకం, సజీవం చెయ్యాలి.

'నాటిక' రచన ఒక విశిష్టమైన కళ. 'నాటిక'కు ఒక ప్రత్యేక ప్రయోజనముంది. ఆ ప్రయోజనాన్ని మన తెలుగు నాటికా రచయితలు పూర్తిగా వినియోగించుకోలేదనే చెప్పాలి. అందువల్ల తెలుగు 'నాటిక'ల్లో యింకా కొంత కృషి అవసరమని తోస్తుంది.

ఈ నాటికలకు ప్రేక్షకలోకం చూపే ఆదరణలను పురస్కరించుకొని, ముందుముందు యింకా మంచి నాటికలు వ్రాయడానికి కృషి చేస్తాను.

ఈ నాటికల ప్రదర్శనాలకు ఎక్కువగా తోడ్పడిన గుంటూరు నాట్యసమితి విజయవాడ రాఘవ కళాకేంద్రం మిత్రులకు నా కృతజ్ఞత.

నాటక ప్రదర్శనం విజయవంతం కావాలంటే క్రమమైన పద్ధతిలో రిహార్సల్సు వేయడం అత్యవసరం—

రిహార్సల్సు వేయడమనేది పరిశోధించి సాధించవలసిన ఒక ప్రత్యేక కళ—

—యీ విషయాన్ని ఆమోదించి ఆచరించే ప్రతివారికీ యీ నాటికలు ప్రదర్శించడానికి హక్కువుంది.

—రచయిత

1949 జనవరిలో ఏలూరులో జరిగిన ఆంధ్రనాటక కళా పరిషత్తులో గుంటూరులో నాట్యసమితివారు 'అంతర్వాణి' ప్రదర్శించి నప్పుడు—

| | | |
|---|---|---|
| సత్యం | — | శ్రీ డి. వి. నరసరాజు |
| జగన్నాధం పంతులు | — | శ్రీ బి. జగన్నాధ్ |
| పిచ్చయ్యశాస్త్రి | — | శ్రీ బి. రవీంద్రనాధ్ |
| మణి | — | శ్రీ బి. పార్థసారధి |

1950 ఏప్రిల్‌లో కాకినాడలో జరిగిన ఆంధ్రనాటక కళా పరిషత్తులో విజయవాడ రాఘవ కళాకేంద్రంవారు 'వాపస్' ప్రదర్శించి నప్పుడు—

| | | |
|---|---|---|
| శఠకోపం | — | శ్రీ వెంపటి |
| ప్రిన్సిపాల్ | — | నరసరాజు |
| లెక్కల లెక్చరర్ | — | కాశ్యప |
| తెలుగు ,, | — | మాచినేని |
| ఫిజిక్సు ,, | — | యం. యస్. మూర్తి |
| హిస్టరీ ,, | — | కె. పార్థసారధి |
| ప్యూన్ | — | గోపాలం |

# అంతర్వాణి



[స్థలం- జగన్నాథంగారి యిల్లు; సమయం: షుమారు రాత్రి 10 గం॥. ప్రవేశం- జగన్నాథం పంతులు - భగవద్గీత పఠిస్తూ]

జగ: (భగవద్గీత చదువుతున్నవాడు-ఆపి) మణీ!

మణి: ఏమి సార్?

జగ: టైమెంత?

మణి: (గడియారము చూచి పచ్చినట్లునటించి) పత్తు మణిదా, అపునుసార్!

జగ: ఉఁ! అబ్బాయి ఇంకా రాలేదు కదూ?

మణి: (చేతులు నలుపుతూ) ఇల్లెసార్! వరిల్లే!

జగ: రాడు:....వాడెందుకు వస్తాడూ!.... కొత్తగా నిశాచరపు వెధవై పోతున్నాడు.... అదేమంటే స్టూడియోలో తీరడం లేదంటాడు .. క్షణం తీరికలేదు దమ్మిడీ ఆదాయంలేదు.

మణి: (సానుభూతితో) ఇల్లేసార్... అప్డీఇల్లే స్టూడియోవ్లే రొంబపనిదా ఉండును . అయ్యాకి.

జగ: ఆపనేమిటో పగలేడ్చుకోగూడదూ! రాత్రిళ్లేమిటోయ్ ఈయనచేసేపని.. డిక్లో వాళ్లంటరూ రాత్రి

ప్లేచేసుకుంటున్నారా ఏం.విటి.... మరీ ఈ సినిమా వాళ్లకే వచ్చింది-రాత్రిళ్లు తప్పపనులుసాగవుట. . అందుకే సినిమావాళ్లు ఉత్త తప్పుడు వెధవల న్నారు.... ఊరికే అంటారూ!

మణి: అప్పీఇల్లేసార్.... నమ్మక్లార్కులు ఉండారే.... గుమాస్తాపులు... కలెక్టరాఫీస్ గుమాస్తాపులు ... వాండ్లుకూడ రాత్రిదా చేస్తురు - ఆఫీసు పని . .

జగ: ఏడిశారులే...వాడితోపాటునువ్వా ఎందుకు ఈ జాగరణ...వంటఇల్లు సర్ది... పండుకో పో ... వాడు వచ్చినా ఈ వేళప్పుడు భోంచేస్తాడోలేదో. . ఛీ! ఛీ! ఛీ! ఛీ! ఛీ... రేషన్ రోజుల్లో కూడ జాగ్రత్తలేకపోతే ఎట్లా?

(మణి లోపలికి పోతాడు. జగన్నాధం ఐశ్యం పీట్చిపల్లీ భగవద్గీతలో శ్లోకం చదువుతుంటాడు)

సత్యం: (హడావుడిగా ప్రవేశించి- కండువా తీసి కుర్చీ మీద విసిరి) యిళ్ళు అబ్బబ్బబ్బ అని కూల బడ తాడు)

జగ: (సత్యాన్ని-ఎగాదిగా చూసి) ఎవరి మీదోయ్ ఈ విసుగు

సత్యం: (నిర్లక్ష్యం)

జగ: ఇంతపొద్దు పోయిందేం?

సత్యం: పోయింది! ఎంత పోయింది?

జగ: అంతతెలియకుండా ఉండటానికి ఏంచేస్తున్నావ్?

స: ఏంచేస్తున్నాను?

జగ: ఏంచేస్తున్నావనే అడిగేది...వినపట్టంలే?

స: ఏంచెయ్యటంలే...

జగ: ఏఁచెయ్యటంలే... తల తిరుగుతున్నదా ఏఁ... ఏమిట్రా నీ పెడసరమూ నిర్లక్ష్యమూను? అడిగిన దానికి సరిగ్గా సమాధానం ఇవ్వవ్...

స: అడిగినదానికి సరైన సమాధానంచెప్తే పెడసరమా? అయితే మాట్లాడనులెండి... అదైనా వినయ మౌతుందేమో...

జగ: పెడసరంకాక మరేమిట్రా...పొద్దుపోయిందేఁరా అంటే పోయిందా అంటావు...ఏంచేస్తున్నావంటే ఏఁచెయ్యడంలేదంటావ్...అడిగిన దానికి సరిగ్గా సమాధానం చెప్పక్కర్లేః?

స: అవును నాన్నా...నిజంచెప్పాను... అంతకంటే ఏఁచెయ్యమంటావ్?

జగ: ఏడవమంటాను?

స: ఎందుకు నాన్నా నామీద అంతకోపం... నీకేం చెప్పాలో నాకే తెలియకగాని...ఆరుగంటలకు స్టూడియోనుండి బయలుదేరాను...స్నేహితుల్తో తారల్ని సెలెక్టు చెయ్యాలంటే...కొంతమందిని చూడాలనివెళ్లాం—చూశాం...ఒక్కతె తాలుకాయరకం లాభంలేదురా అని తిరుగుమొఁహం పెట్టాం ... దారిలో ఓస్నేహితుడు 'కాఫీ' అంటే హోటల్లో దూరాం...అక్కడిపని అయి బయల్దేరి పోతూ ఉంటే ఒక Prospective producer తారసిల్లాడు. ఆయన్ని మెల్లిగా దువ్వకుంటూ బీచికి తీసుక వెళ్లాం...అక్కడ్నించి బయల్దేరబోయ్యేటప్పటికి

10 అయింది. అప్పటికన్నా ఇల్లుభేదువుందాం అని లేపబోతూంటే... ఆనూతన నిర్మాతగారు బనోటా ప్రోగ్రాంపెట్టాడు...కాదంటే బాగుండ దని సరేనన్నాం...బనోటా ముడుపు చెల్లించు కుని బయట పడేసరికి ఆయన మళ్లీ పిలిచన్నాడు. ముందుముందు ఆయనపర్సుతో పనిఉంది గనక ...ఆడెలికసీవల్ల కాదనలేక పొయ్యాం...ఇప్ప టికి ఏదో అర్జంటు పని అని తప్పించుకు వచ్చే టప్పటికి...నాకు ప్రాణంబులున్ తావుల్‌దప్పె... ఈ కథంతా మీతో ఏకరువు పెట్టడమెందుకూ అని అనుకుంటే మీరూరుకోరాయె...ఇంకనేనేం చేసేది చెప్పండి...బహుశా అబద్ధంచెబితే బాగుం దేదేమోలే...అసలుమీరేమిటిలెండి ఇవ్వటి జనాభా యేఅంత. Sincere గా పనిచేసేవాడికి కూడుపుడు తున్నదా చెప్పండి...అసలునిజం పనికిరాదోయ్ బాబూ పనికిరాదు.

జగ: ఆ! బయల్దేరావ్ లే....ఎలాగైతేనేం ... నిజం చెప్పేమొగాడివి...నోరువిప్పితేసరి అబద్ధం! సిగ్గు లేకపోతేసరి.

స: నోరుమూసుకొనిఉంటే నిజం కాబోలు.

జగ: ఛీ! నోరుముయ్యి... పెధవ సమాధానాలూనువ్వూ ఒళ్లుమండిపోతూ.. ఆ పేరు పెట్టుకున్నందుకైనా నిజం చెబుతావేమోనంటే.

స: పేరు పెట్టుకున్న తర్వాత నిజం చెప్పకపోతే ఏం

అని.

జగ: నేర్చావులే ఎలాగై తేనేం— వితండవాదం.... ఇంతచదువు చదివిందీ ఇందుకేనా? అబద్ధం ఆడడ మంటే మంచినీళ్ళప్రాయమై పోతే!

స: నాన్నా! "నిజంచెప్పు నిజంచెప్పు"అని అనే వాళ్ళేగాని ... నిక్కచ్చిగా నిర్మొహమాటంగా నిజంచెబితే...మెచ్చేవాళ్ళెంతమందండీ! అందాక ఎందుకు...ఇందాక మేము చూడబోయిన తారల్లో ఒకావిడె అచ్చం హనుమంతుడికి సిష్టర్ లాగ ఉంది. నిర్మొహమాటంగా...ఏమండీ! మీమొహం కోతిముఖంలాఉదండి... ఎంత మేకప్ చేసినా లాభం లేదండీ" అని అనేటప్పటికి ... ఆమె ప్రక్కనే ఉన్నాడు ఒకాయన భర్తేననుకుంటా ...లేకపోతే ఎందుకువస్తుంది అంతకోపం... ఆయన ఉహజేశివతాండవం...ఏచెప్పమంటారు. మూడోకన్నంటూ లేదుకాని...ఉంటేనా బాబోయ్ ఇంకేమైనాఉందా?

జగ: ఓరేయ్...నువ్వు మరీ బరితెగిపోతున్నావు... పెద్దాచిన్నా లేదూ!...హనుమంతుణ్ని అబ్బ... అవమానం...అస్కలిత బ్రహ్మచారినట్రా ఈ బోగంతొత్తుల్తో పోలుస్తావ్... మతి పోతున్న దట్రా...దానిరంకుమొగుడి కోపం...శివతాండ వమా? ఒరేయ్ దేవతాదూషణ...ఫలితం అనుభ విస్తావ్...నీ అబద్ధాలకుతోడు ఇదోఘాటా... (కోపంతో ఊగిపోతూఉంటాడు)

స: నాన్నా! పొరబాటు! పొరబాటు! శాంతించు... నిజంచెప్పినందువల్ల ఏం లాభంలేదు అని-

జగ: లాభం లేకపోవడం ఏమిట్రా- నిజం చెబుతే కొడ్తార్రా?

స: నీకు తెలీని విషయమేముంది నాన్నా! చిన్నప్పుడు మాపంతులు ఒక సారికొట్టాడు! ఎందుకు? నిజం చెప్పినందుకేగా?

జగ: ఏడిశావ్! నిజంచెప్పినందుకా? ఏదో కొక్కిరాయి పని చేసి ఉంటావ్...

స: ఏం చెయ్యలేదు నాన్నా! ఏం జరిగిందంటే...మా పంతులు కిటికీ దగ్గర కూర్చొని పాఠం చెపుతు న్నాడు.

జగ: ఒరేయ్! గురుదేవుల్ని ఏకవచనప్రయోగం... చెడిపోతావు

స: ఆఁ! ఆఁ! తప్పు, తప్పు చెబుతున్నారు! (లెంపలు వాయించుకుంటాడు)...అప్పుడేమైందంటే కిటికీ లోనుంచి గాలికొడుతున్నది. నేను ప్రక్కనే నిల్చొనిఉన్నా...ఆగాలికి పిలక రెపరెప కొట్టు కుంటూఉన్నది. అదెక్కడగాలికి ఊడిపోతుందో నని - చిన్న పిల్లవాణ్ని కదండి- ఆదుర్దాతో మాష్టారూ! మాష్టారూ! మీ పిలక గాలికి ఎగురు తోందండి అన్నా. అబద్ధమా? అక్షరాలా నిజం. పోనీ శిష్యుణ్నికదా! నిజం చెప్పానని హర్షించారా! వెంటనే దవడ పళ్లూడిపోయ్యేటట్టు చాచి లెంప కాయ కొట్టాడు... ఆఁ! కాదు! కొట్టారు. ఏం

లాభమండి.... నిజంచెప్పి. .

జగ: ఆఁ! నువ్వుచెప్పకపోతే ప్రపంచంమునిగి పోదు లేవోయ్! పుట్టకపోరు...యుగానికిఒక్కొక్కరు సత్యానికి ప్రాణంఇచ్చే సత్యహరిశ్చంద్రులు... చ్చా! చ్చా! చ్చా! ఆమహానుభావుడి కథ ఇప్ప టికీ ఎంత-

స: అది నేనొప్పుకోను...సత్యహరిశ్చంద్రుడి కథవిన్న వారు ఎవ్వరూ నిజం చెప్పాలని నిశ్చయించు కోరు. అబద్ధంచెప్పని వాడి బ్రతుకు అధోగతి పాలౌతుందని హరిశ్చంద్రుడి కథ హెచ్చరిస్తుం టే...సుఖపడదల్చుకున్న వాడెవ్వడబద్ధమాడు తాడునాన్నా? ...అయితేగియితే. .ఆకథవల్లలాభం ఎవరికయ్యా అంటే హరిశ్చంద్రనాటకం ఆడే నట కులికి,నాటకాన్ని ఆడించే కంట్రాక్టర్లకి లాభం... అంతకుమించిఅపగింజంతైనా ప్రయోజనం లేదు.

జగ: సంతోషించాంలే...విరగబడిపోతున్నావ్ పెద్దల్నీ దేవతల్నీ... దూషించవాకురాఅంటే - సరేలే... దాని ఫలితం నువ్వే అనుభవిస్తావ్... లేచి భోం చేయ్...ఇప్పటికే చాలా పొద్దు పోయింది...

మణి: (లోపల్నుంచి) సార్

స: ఇంకేంభోజనంనాన్నా! ఇప్పుడేగా బసోటా భోజ నం అయిందనిచెప్తా...

జగ: (Side curtain) మణీ! మణీ! అబ్బాయి భోంచె య్యడటలే. నువ్వు ఆన్నీ సర్దుకొని నామంచం

దగ్గర చెంబుతో మంచినీళ్లు...ఇత్తడి చెంబుతో
నీళ్లు...పెట్టి...వాడికికాసిని పాలుఇచ్చి పడుకో,

మణి: పాలు పిల్లిదా తాగిపూడిసింది.

(సత్యంలోనికిపోతాడు)

జగ: అందుకే. ఆ కుక్కను రాత్రిపూట విడిచిపెట్టరా అంటే-

మణి: నిన్న అట్లదాచేస్తిని సార్. పిల్లిదారాలేదు! కుక్క తినిపూడిసిందిసార్.

జగ: ఏడిశావులే రేపు పిల్లికి కాపలా కుక్కనువదిలి, కుక్కకి కాపలా నువ్వుపడుకో

(Few minutes pause కొంచెం అటూ ఇటూ తిరిగి కూర్చోని సత్యం!)

స: (ప్రవేశించి) నాన్నా!

జగ: ఇలారా! ఈకూర్చీలో కూర్చో!

స: (కూర్చుంటాడు).

జగ: (మెల్లిగా గొంతు సవరించుకుంటూ) అబ్బాయి!

స: ఊఁ!

జగ: ఇదిగో చూడూ ... నేనా పెద్దవాణ్ణయిపొయ్యాను.

స: అవును.

జగ: బ్రతికినన్నాళ్లు...బ్రతకనుగదా

స: నిజమే

జగ: ఏదో నీకు కుర్ర తనం...చెడీ పోతావేమోనని గాని...

స: అబ్బ...నాన్న... యివ్వాళ... అన్నీ... నిజమే చెబుతున్నావునాన్నా-

జగ: వినరా? నువ్వుగాక నాకింకెవ్వరున్నారు చెప్పు.

స: ఏమిటినాన్నా! ఏఁమిటి సంగతి?

జగ: సొంతంచెప్పనివ్వరా!

స: చెప్పు.

జగ: చూడూ! మీ అమ్మ పోతూపోతూ...నిన్ను నాచేతుల్లో పెట్టింది. నీ కేమీ కొరతలేకుండాపెంచాను. చిన్నప్పుడు కొక్కిరాయివేషాలు వేస్తే వేశావు గాని ఇప్పుడిన్నించైనా నామాటవిని నన్ను సంతోష పెట్టరా!

స: నీమాట విననన్నానా...నాన్నా!

జగ: అట్లా అంటేగాదు...మాటవింటానవి వాగ్దానం చెయ్యి.

స: వాగ్దానం చేసి...నమ్మకంలేక . . తప్పితే?

జగ: తండ్రికి మాటఇచ్చి...ఎలాతప్పగలవురా?

స: ఏఁ! అబద్ధం ఆడలేనంత అసమ్మర్ధుణ్ణినుకున్నావా నాన్నా!

జగ: అదుగో మళ్లీ...కొక్కిరాయవేషాలు ప్రారంభించావు . . . బ్రతిమాలిచెప్తున్నాను నామాట వినరా!

స: సరే నాన్నా! వింటాను, చెప్పు!

జగ: నువ్వు ఇదివరికటిలాగ పిల్లవాడివికాదు. పెద్దవాడి వయ్యావ్...బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా అన్న సామెతలాగ...ఇప్పటికే ఆడిగి పోవలసింది...ఇకనైనా ఒక ఇంటి వాడివై నాముద్దు చెల్లించు.

స: ఇప్పుడుపుటుకేం నాన్నా! ఈ ఇంటికి ఇంటివాణ్ని కామా!

జగ: అబ్బ! ఎప్పుడూ ఈ వితండవాదాలేనా? పెళ్లిచేసుకోరా నాయనా!

స: ఆడిన మాట తప్పక పోవడమంటూవస్తే నాకిప్పుడు ఆత్మహత్య తప్ప వేరేమార్గంలేదు. ఉండి ఉండి సంకటంలో భలే పడేశావే! నాన్నా!

జగ: ఒక్కగా నొక్క కొడుకువి. నాముద్దు చెల్లించవూ

స: నాకూ ఒక్కగా నొక్క తండ్రివి! నాముద్దుచెల్లించవూ?

జగ: అదేవిటిరా! నీమాటకు ఎప్పుడన్నా ఎదురు చెప్పానట్రా. నువ్వుచెప్పినట్లల్లా చేస్తా...

స: చేస్తానని వాగ్దానంచెయ్యి.

జగ: ఓ త్రికరణశుద్ధిగా చేస్తాను...గాయిత్రీసాక్షిగా ..

స: వాగ్దానం అంటే ఎలాంటిదీ?

జగ: అనుమానం ఎందుకురా? అడగరా?

స: వాగ్దానాన్ని పాటించలేకపోతే ముందుగానేచెప్పు. అంతేగాని తరువాత పట్టుదలతోసత్య హరిశ్చంద్రుడి styleలో పడ్డావా...నాకు చిక్కువస్తుంది.

జగ: అబ్బ! ఏఁవిట్రా ఈవేళాకోళం

స: అయితే నాకోరిక తీరుస్తావన్నమాట

జగ: ఆఁ?

స: అయితే ఏఁ కోరుకో నబ్బా! ...ఆఁ; నాన్నా! నన్ను పెళ్లి చేసుకోమని నిర్బంధం చెయ్యనని

వాగ్దానంచెయ్యి.

జగ: అరెరెరెరే! తుంటరి వెధవా! ఏమన్నావ్! పీపు బద్దలుచేస్తా...ఏమనుకున్నావో! నాకు కోపం వచ్చిందంటే మనిషినికాను...తెలిసిందా.

స: ఆఁ! కోపంరాకపోతే మటుకు ఏం నాకు తెలీదా నాన్నా...అయినా ఇంతలోకే అబద్ధమాడేవేం నాన్నా అసహ్యంగా!

జగ: వెధవ...ఏదోవృద్ధిలోకొస్తావు...మమ్మల్ని ఉద్ధరిస్తావ్...అని కని పెంచి, పెద్దవాళ్నిచేస్తే...

స: ఏదో పిల్లలు లేరని బెంగ పెట్టుకుంటున్నారు... పున్నామ నరకం తొలగించి స్వర్గానికి పాస్‌పోర్ట్ యిద్దాంగదా అని దయతలచి...నేను మీకడుపున పుడితే....

జగ: ఏడ్చావ్! నోరుముయ్! వెధవా!సిగ్గులేదురా! మొగాడివై పుట్టి .. పెళ్లొద్దంటావ్...

స: ఆఁ ఆఁ! నీకా అనుమానం రావడానికి నేను అపరబుష్యశృంగుణ్ణని...ఆడవాళ్లే పొడగిట్టదనీ అన్నానా!...పొద్దునలేస్తే మా[బ్రతుకు వాళ్లమధ్యే తెల్లారుతుందే...ఆఁ...

జగ: పెళ్లివద్దంటావెందుకురామరి?

స: అక్కడే వస్తోంది నాన్నా. చిక్కు.

జగ: చిక్కేమిటోయ్?

స: "పెళ్లి" అన్న మాటకు అక్షరాలు రెండేగాని వాటిలో ఇమిడి ఉన్నభావం మటుకు అగాధం.

షండిగిరి పావుల్లా.

జగ: అప్పుడే పెళ్లి సంగతి నేనేమన్నా ఎరుగుదునుగనకా!

స: ఎరగవనిగాదు నాన్నా? మీకాలానికి మాకాలానికీ చాలా తేడావుంది... అసలు నేను పెళ్లి చేసుకోవా లన్న పట్టుదలెందుకు నాన్నా నీకు?

జగ: పట్టుదలేంవిటీ! అందరూ ఎందుకు చేసుకుంటు న్నారు? శాస్త్రం ఏమని ఘోషిస్తూంది? పెళ్లి ప్రకృతి ప్రేరితం దీన్ని ఎవరూ తప్పించుకోలేరు మానవుడు జన్మించిన తర్వాత ఏఏ వయస్సుల్లో ఏఏ విధులు నెరవేర్చాలని పెద్దలుచెప్పారో అవి నేరవేర్చకపోతే జన్మసార్ధక మెలాగౌతుంది.

స: అట్లాగా! అయితే నాన్నా నేనొహటడుగుతాను చెప్పు...నాపెళ్లిలో ఏభాగం నీకు ముఖ్యం?

జగ: పెళ్లిలో భాగమేమిటి? నీతలకాయ్!

స: అయిన వివరించెద నవధరింపుడు - నేను ఒక అమ్మాయి మెళ్లోమూడుముళ్లూ వెయ్యటమా? లేక మా అబ్బాయికి పెళ్లయిందని నీవు పదిమందితో చెప్పుకోవడమా? లేక యింట్లోకోడలనే status తో ఒకానొక లతాంగి ఉండటమా? లేక యింట్లో వంటచేసే ఆడదిక్కు ఉంటుందనా?... వీటిలో ఏది నీకు ముఖ్యం?

జగ: సంతోషించాంగాని...చాల్లే...నీతెలివితేటలు... నన్యాపి...

స: అలాఅంటే... ఏం చెప్పేదినాన్నా! దేనికైనా

హేతువాదం అవసరమంటావా? లేదా?

జం: తగలడ్డట్టేఉంది...నీ హేతువాదం....ఘాలివాన మూను.. పాతిక్రేళ్లు ముద్దికిందికొచ్చినై... ఎందుకు ఏడవనా... నీకన్నా తెలియాలి.. తెలియకపోతే చెప్పినమాట వినాలి, పెద్దాచిన్నాఉండక్కర్లా

స: ఉండాలి కాబట్టే చిన్నవాళ్ళమాటల్ని అర్థంచేసుకోమనేది... చాతకాకపోతే వినాలి, వాటి ప్రకారం నడుచుకోవాలి.

జగ: ఏముంది... మాటలునేర్చిన కుక్కను వేటకు తీసుకుపోతే "వుస్కా" అంటే "వుస్కా" అందట.

స: నానోన్నోయ్! కుక్కకూ నాకూ ఒకటేనా ఉంది.. కుక్క విశ్వాసం గల జంతువు, ఆ విశ్వాసం మనకు లేదు.

(తలుపుచప్పుడౌతుంది)

స: ఎవరదీ (తలుపుతెరచి) రండి [illegible]
(ప్రవేశం పిచ్చయ్య...వర్లెటూరి వాలకం)

పి: తమరేనాండి జగన్నాధం పంతులుగారు.

జగ: అవును... రండి దయచేయండి (ఆసనం చూపిస్తాడు)

పి: (కుర్చీలో కూర్చుంటు) మీ అబ్బాయి. సత్యనారాయణకటకృష్ణ హరనాధ బాబు అనుకుంటాను.

స: చిత్తం! అంతపేరుయిప్పుడు వాడుకలో లేదు. సత్యం

అంటేచాలు! అయితే...ఇందులో ఎవరితోపని ఉండివచ్చారు?

పి. (యికిలిస్తూ) ఇద్దరితోటీనండి (జగన్నాధం వైపు తిరిగి)మాది జిల్లేడులంకల అగ్రహారం...నాపేరు పిచ్చయ్యశాస్త్రి అంటారండి,

స: అయ్యో! తమ తల్లితండ్రులు చాలా దూరదృష్టి గల వారుగా కనుపిస్తున్నారండి.

పి: (ఇకిలిస్తూ) మా ఇంటిపేరు చాదస్తంవారండి.

స: ఇంకేం!

పి: నేను...చిన్నపనిఉండి వచ్చానండి,

స: వరాన్వేషణకేనా?

పి: నాకు ఈడు కొచ్చిన ఆడపిల్ల ఉందండి. మా అమ్మాయికి చిన్నప్పుడే తల్లి కరువైందండి... అతిగారాబంగా పెరిగిందండి,

జగ: మావాడూ అంతేనండీ...తల్లిలేని పిల్లవాడు... అతిగారాబంగా పెరిగాడు.

పి: మా అమ్మాయిని...ఏదో.... B. S. C. దాకా చదివించానండి...

జగ: మావాడు M. A. ఫస్టుక్లాసండి...

పి: ఏదో ఇంత సంగీతం...నృత్యం...అవి నేర్పించానండి.

జగ: అంతవరకేనా...లేకపోతే...సినీమాల్లోగాని నాటకాల్లోగాని . . ప్రవేశపెట్టారా?

స: ఆదేఁవిటి నాన్నా! అలా అసభ్యంగామాట్లాడ్తావ్.. గౌరవ కుటుంబీకులు అలాచేస్తారా!

పి: మా అమ్మాయికి నేనంటే అతి భక్తిలెండి.
జగ: మావాడికీ అంతే...నామాట జవదాటడు, .. ఈ కాలపు కుర్రవాళ్లలాకాదు. చాలా బుద్ధిమంతుడు.
స: (హఁ హఁ అని గర్వంగా సకిలిస్తాడు)
జగ: మావాడికి కవిత్వం అంటే అభిమానం.. సంగీతమంటే చెవికోసుకుంటాడు.
పి. అందుకనే ఏదో చిత్రానికి డైరెక్టరైనాడుటగదండీ?
జగ: ఆఁ; మావాడు సినిమాల్లో చేరాడంటే ... ఉత్తకళోపాసనకేగాని...అసలు సినిమా వాళ్ళంటే లోకంలో గౌరవంలేదు...కాని మావాడి విషయం వేరు...అంతా ఈపరిశ్రమలో దిగవలపిన వాడు కాదంటారు...పెద్దమనిషని ప్రఖ్యాతిఉందిలెండి,
పి: విన్నానండి, ... మీ అబ్బాయినిగురించి ... వినేవచ్చానండి.
స: విన్నారూ? వింటారు! వింటారు!
జగ: మావాడు కవిత్వంకూడా రాస్తాడండోయ్.
పి: అలాగా! నేనీసంగతి వినలేదండి.
జగ: ఒరే అబ్బాయి! నీగీతాలు నాలుగు వినిపించు.
స: వినిపించమంటారా! పట్టానబ్బా గొంతుసరిగ్గాలేదే
పి: ఏదో నెమ్మదిగానే వినిపిద్దురూ.
జగ: వినిపించరా ... అంత ఆప్యాయంగా అడుగుతుంటే.
స: ఒక్క-షరతుమీద ... నేను చదివేటప్పుడుమధ్యలో మాట్లాడడం ... చప్పట్లు కొట్టడం ..హాయ్

హాయ్ అనడం.. పిచ్చిపిచ్చి కళలు, చేయ కూడదు. నా ఆసు కవిత్వానికి అంతరాయంకలి గించ కూడదు. (చదువుతాడు)

ఎవ్వరనకొంటిరోనన్ను
ఏను కవిని, ఆధుసిక కవిని!
కలవురెండే రెండు కన్నులునాకు- అవి కనబడవు.
కలవురెండే రెండు వీనులునాకు- అవి వినబడవు.
నేను నోరువిప్పి మాటలాడితినయేని—
నానోటిలోని ముత్యాలపలువరస- మీకు కనపడును
యేనుగొంతెత్తి పాడితినయేని-మీకు వినుబడును.
యేను ఎలుగెత్తి ఏడ్చితినయేని
నాదుకన్నీరు యేరులై- వాగులై పారి
ముల్లోకములముంచివై చిభువినిసస్యశ్యామలంబొనర్చు
లోకమున కరువుకాటకంబులు మటుమాయంబగు.
ప్రజలకు శాంతిసౌఖ్యంబులు ఒనగూరు-
యేను ప్రజాకవినన్న-
కాదనగల వెధవెవడీ యిలలో! గదరాసుమతీ!

పి: ఆహా! ఆహా! .. అమోఘం .. అద్భుతం .. అపూర్వం .. అచింత్యము.

స: అదుగో అదే వద్దన్నాను .. యింకేముంది ... ఆశువుకు ఆనకట్ట అమాంతంగా అడ్డుతగిలింది.

పి: యింకెందుకు బాబూ! యీ విన్నదానికే అమందానంత కంధళిత హృదయారవిందుండనైతిని,

జగ: ఏమండోయ్- మావాడి కవిత్వం వినగానే ...

మీరూ కవిత్వ ధోరణిలో పడ్డారే.

స: కవిత్వం అంటువ్యాధిలే నాన్నా! ఏమండోయ్! వచ్చేవచ్చే వాంతినీ - కవిత్వాన్నీ ఆపకూడ దన్నారు పెద్దలు ... అలా బయటికి రానిచ్చె య్యండి ... లేకపోతే చిక్కిపోతారు.

పి: మీ అబ్బాయికి ఒక్కదర్శకత్వంలోనే ప్రావీణ్యం ఉందని విన్నాను గాని ... ఇప్పుడు కవిత్వంలో గూడ సిద్ధహస్తుడని తెలుసుకుందుకు చాలా సంతో షం పడ్డానండి.

స: రేపు విచారంలో పడరని గ్యారంటీ ఏముంది లెండి

జగ: అయ్యా! తమకేమాత్రం స్థిరం, చరం ఉందండీ.

పి: ఉన్నదిలెండి ఏదో ఓ పది ఎకరాల మాగాణీ, మావూళ్లో రెండు భవంతులు స్థిరం.

స: చరం మాటసెలవిచ్చారు కాదు.

పి: అదీ ఉందండి. ఆస్థిరంమీద అప్పుచేసి ఖర్చయిన చరం-రెండూ సరిసమానంగానే.

స: అంతమాత్రమైతే చాల్లేండి- వింటున్నావానాన్నా!

పి: అప్పులంటే ... ఇతరత్రా దుబారా చెయ్యటానికి చేసినవికాదండి ... నాలుగుసంవత్సరాలనుంచి పిల్ల చదువుకోసం పట్నవాసం చేస్తుంటే అయినఖర్చు లకి ... ఆస్తి అమ్మయినా సరే చదువు చెప్పించా లని పట్టుదలతో చెప్పించాను.

జగ: ఆస్తితో నిమిత్తమేముందిలెండి ... ఏదో పిల్ల

చక్కగా చదువుకొని ... ఒక ఇంటిదై -

స: ఆ చదువునంతా వంటింట్లో పొయ్యిఊదటంలో... సంసార జీవనం వల్ల పిల్లల్ని కనడంలో విని యోగిస్తే చాలదూ ఆవచ్చిన మొగుడు మాఆవిడ బి. యస్. సి:- చాలా పార్వర్డు వుమన్ అని వల్లి సిటీ చేసుకుంటూ తిరుగుతుంటేచాలదూ,

పి: పంతులుగారూ। అక్కడే వస్తోంది, ఘట్టిచిక్కు.

జగ: ఏం!

పి: పిల్ల పెళ్ళికి ఒప్పుకోవడంలేదు ...వద్దంటున్నది

జ: ఇప్పటికేనా .., ఎప్పటికీనా?

పి: అసలే వద్దంటున్నదండీ.

జ: ఎంచేతో...మనకు చెప్పకూడని సంగతులేమైనా ఉన్నాయేమో...డాక్టర్లకు చూపించకపోయారా?

పి: దానికేంరోగమండి... నిక్షేపంలాంటి పిల్ల...అన్ని సరిగ్గానే వున్నాయి.

జ: అంతాసరిగ్గావుంటే పెళ్లెందుకు వద్దంటూందండీ.., ఇందులో ఏదో చిదంబర రహస్యంఉందండి . . మీకు తెలీదు.

పి: చిదంబర రహస్యంలేదు. . .చింతపిక్కలరహస్యం లేదు . . . దానికి సినిమాలోచేరాలని సరదాగా ఉం దటండీ.

స: విప్లవం . . . సాంఘిక విప్లవం . . . ప్రకృతే తన కర్తవ్యాన్ని గుర్తించుకుంటున్నది. ఎంతకాల మని సంఘం తన ఇనపసంకెళ్లచేత వ్యక్తిత్వాన్ని

బంధించగలదు. **Hats off to Miss chadastam Pitchayya...Three cheers...Hip Hip Hip Hurrah)**

జ: ఏడిచావు! వెధవా! సినిమాలో చేరకపోతే గంగలో దూకకపోయిందీ!

పి: ఎంతచెప్పినా వినడంలేదండి ... మరీ బలవంతం చేస్తే ఏమయ్యో గొయ్యో చూచుకుంటానంటుంది

స: మేలుకుంటున్నది...స్త్రీశక్తి మేలుకుంటున్నది. స్త్రీప్రకృతి చైతన్యంపొంది,పురుషపాషండ ప్రభుత్వాన్ని ఎదుర్కొబోతున్నది...**Hats off to Miss Chadastam Pitchayya--Second time**

జ: ఆః! దూకుతా! దూకుతా! అన్ననాసవితేగాని,... దూకిననాసవితి ఒక్కతే లేదన్నదట—వెనకటికి ఒకామె—పెళ్ళిచేస్తేసరి...అన్నీకుదురుతాయ్!

స: బలవంతంగా పెళ్ళిచేయటానికి ఆమెఅష్టవర్షాలు వెండిన మైనరుకన్య కాదుగదండీ...**B, Sc.,** చదివిన వ్యక్తురాలు—మేజరు—ఆమెను బలవంతం చెయ్యడం మీకేప్రమాదం—**It's a crime**—

జ: ఏడిశావులే నోరుముయ్—నీసలహా ఎవ్వరూ అడగలేదు...సంఘమూ—దానికికొన్ని కట్టుబాట్లూ—వాటివిమనం అనుసరించవలసిన అవశ్యకత ఏమైనాగుర్తించి మాట్లాడుతున్నావా?

స: ఛాన్నానేనొక సంగతి అడుగుతానుచెప్పు.

జ: ఏమిటోయ్ నీసంగతి.

స: నీవునన్ను **M. A.** దాకా చదివించావు ఎందుకు?

జ. ఏదో అందుకుతగిన ఉద్యోగంవెలగబెడతావు ... మనవంశ పరువు ప్రతిష్ఠలు నిలబెడతావు అని...

స: పరువూ ప్రతిష్ఠలంటే?

జ: ఒక అయినఇంటిపిల్లను పెళ్ళిచేసుకొని. ఒకర్ళను దేహీఅని అడక్కుండా పదిమందికీ నీచేతనైనసహాయంచేస్తూ స్వతంత్రజీవనం చెయ్యడం— వంశంవృద్ధిలోకి తీసుకరావడం... ఇత్యాదులు.

స: అంటేఖర్చుపెట్టినడబ్బునుమళ్లీ నేనుఉద్యోగంచేసి సంపాదించుకుంటాననేఉద్దేశ్యకూడా ఉందిగదూ.

జ: అవునోయ్! మరి ఎవరుఖర్చుపెట్టింది వాళ్ళు సంపాయించుకోకపోతే ఎట్లా?

స: ఆవిధంగానే పిచ్చయ్యగారు ఆయనస్థిరాన్ని తాకట్టుపెట్టి కుమార్తెకు చదువుచెప్పించారు గదా...ఇప్పుడు ఆమె కర్తవ్యం ఏమిటి?

జ: మొగవాళ్ళవిషయంవేరు...ఆడవాళ్ళు విచ్చలవిడిగా తిరగొచ్చుట్రా.

స: ఇందులో విచ్చలవిడిగా తిరగటమేముందీ... తనుపొందిన విజ్ఞానాన్ని తగురీతినిఉపయోగించుకోవాలని ఆమె ప్రయత్నిస్తున్నది—ఏదోనాల్గు డబ్బులాగణించి తండ్రికి సహాయ పడదామనుకుంటున్నది. ఇదితప్పా...ఇంతమాత్రానికి డబ్బుతగలేసి చదువు చెప్పించడం దేనికీ?

జ: పోరాసీవితండ వాదాలకు నేనుజవాబు చెప్పలేను. పిచ్చయ్యగారూ! వీడిమాటలు విన్నారా

మీకు నిజంగాపిచ్చెక్కుతుంది. ఆమూడుముళ్లూపడ్డ తర్వాత సరైనదోవకు వస్తుంది. ఏం భయంలేదు.

స: అపునులెండి నామాటవింటే బాగుపడరులెండి. మా నాన్న చెప్పినట్లు మీ అమ్మాయికి బలవంతపు పెళ్ళి జరిపించి...ఆమె తన B.Sc, పాండిత్యాన్ని వంటచెయ్యడంలో, పిల్లల్నికనడంలో వెలగ బెడుతూంటే ఇటు ఆస్తినంతా అప్పులవాళ్లు ఎగ రేసుకపోతూంటే...అప్పుడు ఎక్కే పిచ్చితో ఆనందించండి.

పి: లాభంలేదండీ......బలవంతంచేస్తే...ఏదోఅఘా యిత్యానికి పాలుపడుతుంది.

జ: అయితే తమరు ఇక్కడికి ఎందుకు వచ్చినట్టు?

పి: మీ అబ్బాయి పేరువిని......ఏమైనా సహాయం చేస్తారేమో అని—

జ: పెళ్ళిచేస్తే ప్రమాదమని మీరే అంటిరి...ఇంక వాడు చేసే సహాయమేముందండీ?

పి: పెళ్ళివిషయం కాదండీ...సినీమాలోచేర్చి,...గౌర వంగా చూడగలరేమోనని—

జ: ఆఁ ఆఁ ఆఁ...అరి వెధవ పీనుగా...కూతుర్ని తారచేయడానికి తగలడ్డావుట్రా...ఇందాక ట్నుంచీ ఏదో పెళ్ళిసంబంధానికి వచ్చావనుకొని మర్యాదగా మాట్లాడాను ...ఇక నడువు....బయ టికి...వడూ...చూస్తావేం.

స: నాన్నా! నాన్నా! అతిథిసత్కారం మరిచిపో వాకూ? ఆర్తరక్షణం మనవంశధర్మం....

జ: పిచ్చి ఒక్క క్షణం కూడ మన ఇంట్లో ఉండ నివ్వకూడదు.... ఊ పోవేం రా! మణీ! మణీ!

స: ఆఁ! నాన్నా.... ఇంతలావుకొడుకుని నేనుండగా, వాడెందుకు...క్షణంలో బయటికి నడిపిస్తా... ఒక్క నడిపించడమేనా...పరిగెత్తిస్తా....నువ్వు వెళ్ళి పండుకో(అని గదిలోకిపంపి తిరిగివచ్చి) Cheer you మామగారు...బెదిరి పోకండి రండి ...కూర్చోండి.

పి: శలవిప్పించండి...బాబూ...వస్తాను.

స: రమ్మనే నేనూ అనేది.

పి: వెడతానుబాబూ!

స: అరె అదేఁవిటండి .. వస్తానంటారు, మళ్ళీ వెడ తానంటారూ...రెంటికీ ఏఁ బేధంలేదేఁవిటి మన dictionary లో?

పి: నాన్నగారికి కోపంవచ్చినప్పుడు ఎందుకులేండి ...ఏదో నాకష్టాలు చెప్పుకుందామని వచ్చాను. ....నాఖర్మం...ఎందుకు,...వెడతా.

స: ఉండండీ...ఆడపిల్లగలవాడివి...ఇంత మాత్రానికే ఖంగారు తింటే ఎలాగండీ ...పనులవు తాయా?....ఆఁ!ఆడపిల్లను కనగానే సరికాదు.... రండి ఇలారండి...మీతో మాట్లాడాలి. (పిచ్చయ్య కూర్చుంటాడు) సిగరెట్టు కాలుస్తారా?

పి: ఇటువంటివి అలవాటు లేదులెండి,

స: అయితే దున్నపోతుజన్మ తప్పదన్నమాట ఆఁ

అయితే ఏమిటన్నారూ...అమ్మాయి పెళ్ళిచేసుకో నంటుందీ . ఉఁ.

పి: అయ్యో...చేసుకోదుట.

స: ఇదుగో చూశారూ! డాక్టరుదగ్గరకు వెళ్ళితే ఎన్ని ప్రశ్నలేస్తాడో అంతకన్న ఎక్కువే వేస్తాను... విసుక్కోకుండా జవాబు చెప్తానంటే అడుగుతా ...లేకపోతే...మీదారి మీది, నాదారినాది.

పి: ఎందుకు విసుక్కుంటాను...నా శ్రేయస్సుకోరి, నామంచికోసం ఏమడిగితె మటుకు తప్పే ముంది...అడగండి,

స: అయితే...మీ అమ్మాయి పెళ్ళి వద్దంటుందా... అసలు మొగాడి పొదే గిట్టదంటుందా?

పి: పొడ గిట్టక కాదండి...అదేం లేదు...దాని స్నేహితులు...చాలావరకు మొగవాళ్ళే...చాలా సరదాగా మాట్లాడుతూ ఉంటుంది ....పెళ్ళి అంటేనే ససేమిరా అంటూన్నది.

స: ఉహూ...భయంలేదు...లక్షణాలు సుముఖం గానే ఉన్నవి.

పి: మరేనుబాబూ...తమబోటివారు ఏదైనా దారిచూ పకపోతారా అని వచ్చాను.

స: మీ అమ్మాయి పెళ్ళివద్దనడానికి కారణాలేమైనా చెబుతుందా?

పి: ఆ చెబుతుంది...ఏదో పిచ్చివాదాలు చేస్తుంది ...అవన్నీ ఎందుకులెండి.

స: అమ్మమ్మ! ఎంతమాటన్నారూ . ఎం గ మ చేసిం టండీ... అవే చాలాముఖ్యం.... ఆయువుపట్లన్న మాట...ఏమేమి చెప్తుందండీ.

పి: పెళ్ళిచేసుకుంటే వ్యక్తిస్వాతంత్ర్యం ఉండదట... మొగుడు తనమీదపెత్తనంచెలాయిస్తాడట.... తనఅభిరుచులూ,కోరికలు చంపుకుని మొగుడికి బానిసఅయి జీవచ్ఛవం అయిపోతుందట...

స: తప్పేముందండి...అన్నీ నిజమే...చదువుకున్నదికాబట్టి...వ్యక్తిత్వంకోసం పాకులాడుతుంది ...సహజమే......అయితే ఆమె చెప్పినట్లల్లా ఒప్పుకునేవ్యక్తి దొరికితే పెళ్ళిచేసుకుంటుందేమో కనుక్కున్నారా?

పి: లేదండి ..ఈ సంగతి కనుక్కోలేదు...అయినా పెళ్లాంచెప్పినట్లు నడుచుకునేటంత చవ్చు సన్నాసులున్నారా!

స: ఆఁ! ఆఁ! తొందరపడకండి...మిమ్మల్ని ప్రశ్నలకు జవాబు చెప్పమన్నానేకాని...మీ ఉద్దేశాలను అడగలేదు...యిదుగో చూడండి.... తన అభిరుచులు అంటుందే...మామూలుగా ఆమె అభిరుచులు ఏంవిటి?

పి: ఇదుగో బాబూ, దాపరికమెందుకు...ఆడపిల్లలు గలవాణ్ణి...అబద్ధమాడి ఏం సాధిస్తాను...ఉన్న సంగతి చెప్పేస్తున్నాను...తరువాత తమదయ!

స: చెప్పండి మామగారూ...చెప్పాలనే నా ఉద్దేశం.

పి: దానికి సినిమాలో నటించాలని అభిలాష ఉందండి... పెళ్ళిచేసుకుంటే మొగుడు మూల కూచోపెడతాడని...పెళ్ళి వద్దంటుందండి...సరే దాని ఇష్టప్రకారమే కానివ్వమని...అందుకు మీరే మైనా సహాయపడతారేమోనని వచ్చాను. ఇదీ సంగతి...నిజం చెప్పాను...తర్వాత మీదయ.

స: ఓహో! అదా! ఏమండోయ్...నిజం యిప్పుడు చెప్తే చెప్పారుకాని...ఎప్పుడూ నిజమే చెప్పాలని పిచ్చినియమాలు పెట్టుకోమాకండి. దెబ్బ తింటారు — తిండికూడా పుట్టదు... సరే...మీ సమస్య పరిష్కారమయేటట్టే ఉంది. కాని ఒక్క సంగతి... పెళ్ళిచేసుకోబోయేభర్త, ఆమె సిని మాలో చేరడానికి ఇష్టపడితే.... పెళ్ళిచేసుకుంటుం దేమో కనుక్కున్నారా?

పి: అంమకభ్యంతరమేముంచండి...తప్పక చేసుకుం టుంది...కాని...అలాంటి మొగుడేడీ?

స: అదేమిటండి...అరఘంటనించి పనిగా మామ గారూ,మామగారూ అంటూంటే...మెదడేం చేస్తుందండీ!

పి: అహః అహః!అల్లుడుగారూ! ధన్యుణ్ని! కృత జ్ఞుణ్ని!

స: అయితేమానెగాని...అంతట ఆగండి...పద్య మో పాటో పాడేశారుకారు కొంపతీసి...అయితే అమ్మాయిని కనుక్కోవాల్సినపని లేదంటారా!

పి: ఒక్కర్లేదు బాబు! ఏమీ అక్కర్లేదు. ఈమాటవినగానే ఎగిరి గంతేసి ఛప్పున. ఒప్పుకుంటుంది... భయంలేదు...మనం ముహూర్తం పెట్టుకోవచ్చు:

స: అలాఅయితే శుభస్యశీఘ్రం... రేపే ముహూర్త కొండ కానిద్దాం...అమ్మాయి పేరు?

పి: ముద్దుపేరు 'వద' అండి...వద...అసలుపేరు ప్రియంవద...

స: అబ్బ మామగారూ చూశారా...రెండుపేర్లు ఎలా అతుక్కుపోయాయో...సత్యం...వద.... "సత్యంవద"....ఇంకేం మాకు లక్ష అబద్ధాలాడడానికి లైసెన్సే....Bravo మామగారూ! Three cheers to 'సత్యంవద'

పి: అయితే మీనాన్నగారితో—

స: ఒఒఒఒ....అసలుసంగతే మర్చిపోయ్యాం.., మానాన్నకీసంగతి తెలిస్తే, యీ 'సత్యంవధ' తథ్యము సుమతీ.

పి: అదేమిటండీ....పెళ్ళిచేసుకుంటానంటే నాన్నగారు ఎందుకు కోప్పడుతారూ?

స: పెళ్ళిచేసుకుంటానంటే సంబరపడతారు. కాని పెళ్లాన్ని సినిమాలోకి ఎక్కిస్తానంటేమాత్రం **Quit homeland** ఉద్యమం తప్పదన్నమాటే... పెద్ద చిక్కులోపడ్డానే మామగారు....పెళ్లాన్నిసినీమాస్టారుమచేస్తానంటే నాన్నతో పేచీ.... సినిమా వద్దూ పాడువద్దూ ఇంట్లో కూర్చోమంటేకాబోయే

ఇల్లాలుతో పేచీ To marry or not to marry .... గిరీశంగారి అవస్థలో పడ్డాం .... మామగారూ ఎట్లాగండీ!

పి: పెద్దచిక్కేవచ్చింది.... ఎట్లాగబ్బా....

(ఇద్దరూ ఆలోచిస్తూంటారు)

స: (చిటికెవేసి) అఁ! తట్టింది! భలేప్లాన్...మామ గారు...

పి: ఏఁవిటిబాబు !

స: వివరాలు మీకక్కరలేదు...చెప్పినట్టువినండి.... అంతే. కథంతా నేనునడుపుతాను...ఇలా రండి (చెవులో రహస్యం చెబుతాడు- పిచ్చయ్య సంతోషం చూపిస్తాడు-ఇద్దరూ సైగలుచేసుకుం టారు- పిచ్చయ్య వెళ్ళిపోతాడు సత్యం గదినాల్గు పైపులా పరికించితండ్రిగది వైపు తిరిగి,) అబ్బో! అబ్బో! నాన్నోయ్! నాన్నోయ్!

జ: (ప్రవేశించి) ఏమిట్రాఅబ్బాయ్! కలవరిస్తున్నావు!

స: (గుండెమీదచెయ్యిపెట్టి) అబ్బా! వింటా! నువ్వు చెప్పినట్లు నడుచుకుంటా! ఒట్టు! తల్లితోడు (చొక్కాజేబులోకి చూస్తూంటాడు.)

జ. అబ్బాయి.... ఏమిట్రా నాన్నా!

స: అయ్యో! ఏమిటేమిటి నాన్నా! నులిపేస్తూంది ... బ్రతకను.

జ: సంగతిచెప్పకుండా! ఏమిట్రా కంగారూ!

స: అంతర్వాణీ! నాన్నా, అంతర్వాణీ! గోలచేస్తుంది.

జ: అంతర్వాణేమిట్రా! నీ పిండాకూడు.

స: అబ్బా! అలాగనకు నాన్నా! అపరాధం.... అంత ర్వాణి.... అంటే.... ఇది వరకు మీరోజుల్లో వళ్లు పెరగడం...పూనకం అని అనేవాళ్లు.... దానికి ఆధునిక స్వరూపం ... అంతర్వాణి. కాలంతో పాటు దేవతా స్వరూపాలుకూడమారుతుంటాయి.

జ: ఆఁ అదుగదీ! అలాచెప్పు!... యిన్నాళ్ళనుంచీ పూజలుచేయరా నాయనా అంటే విన్నావూ!... దేవుడులేడు గీవుడులేడు, అని నోటికొచ్చినట్లల్లా అనేశావ్...ఇప్పుడు తెలుస్తుందా దేవుడుందీ లేందీ?

స: ఉన్నాడు బాబోయ్! ఉన్నాడు! దేవుడున్నాడు నాన్నా! అంతర్వాణి క్షమించు.

జ: దేవుడికి అపచారంచేస్తే పూరికె పోతుందిటరా... భగవంతుడి లీలలు మానవులకు అగోచరం... అయితే అంతర్వాణి....ఏమంటుందేమిటి?

స: (సంకోచిస్తాడు)

జ: సంకోచించడందేనికి...చెప్పు...మా నాయనగా!

స: పెళ్లిచేసుకోమంటున్నది నాన్నా!

జ: ఆఁ అలాచెప్పు! నే చెబితే విన్నావూ! పెళ్లి ప్రకృతి సిద్ధమోయ్! ప్రకృతి సిద్ధం....మన పూర్వులు చవటదద్దమ్మలా! ఏదిపెట్టినా అనుభవం తో పెట్టారు...పెళ్లి చేసుకోకపోవడం ప్రకృతి విరుద్ధం...ప్రకృతికి విరుద్ధంగా నడవబట్టే అంత ర్వాణి రూపంలో ఆదేశిస్తున్నాడు. ఇప్పటికైనా ఒప్పుకుంటావా?

స: అదే ఆలోచిస్తున్నా (అవి వెంటనే) అబ్బా! ఊహూ! ఆలోచించను...ఒప్పుకుంటా-ఆ! ఆ! ఏమంటావ్ నీయిష్టమొచ్చిన పిల్లనా—ఆ!అలాగే ఒప్పుకుంటా నీయిష్టమొచ్చిన పిల్లనే చేసుకుంటా—ఆ! మానాన్న ఒప్పుకోడంటావ్— ఏ!నాన్నా నీవు ఒప్పుకుంటావోలేదో నంటున్నది. అంతర్వాణి.

జ: ఒప్పుకోక ఏ! చేస్తానురా...ఏ పిల్లయితే యేంరా అంతర్వాణి మాటకు ఎదురులేదురా నాయనా?

స: (అంతర్వాణితో)మానాన్నకు అభ్యంతరంలేదుట-. ఆమాటను మానాన్ననేచెప్ప మంటావా— నాన్నా! నువ్వేనట చెప్పు.

జ: (చేతులు జోడించి, సత్యంగుండెదగ్గర) ఏ పిల్లయినా నాకు ఇష్టమేస్వామీ.

స: ఆ! ఏమిటి?...పిల్లతండ్రిని కొద్ది పేపట్లో ఇక్కడికి పంపుతావా! సరే....అలాగే (విట్టూర్పు) అమ్మయ్య (కుర్చీలో కూర్చుంటాడు) నాన్నా! భగవంతుడికి యిన్నాళ్లూ చేసిన అపచారానికి ఫలితం అనుభవించాను.

జ: లీలా...ఆహాహా! దేవుడిలీల...మానవ మాత్రులం మనకేం తెలుస్తుందిరా! నాయనా! నిమిత్త మాత్రులం.

స: నిజమే నాన్నా! మనం ఒట్టి మూర్ఖులం!

జ: ఒట్టి మూర్ఖులంకాదు - పరమమూర్ఖులం

[ పరివేశం పిచ్చయ్య ]

మళ్ళీ వచ్చావ్. వెర్రి పీనుగా,

స: ఉండునాన్నా: తొందరపడవాకు...దేవుడిలీల... అర్థంకాదు...మనం మానవులం.

పి: కష్టాల్లో ఉన్నాను... నా మనవి ఆలకించండి బాబూ!

జ: కష్టాల్లో ఉంటే గంగలో దూకు!

స: నాన్నా అప్పుడే మరిచావు...అంతర్వాణిప్రబోధం.

పి: నేను ఇక్కణ్నుంచి వెళ్ళేసరికిఅమ్మాయికి వెంక టేశ్వరస్వామివారు పూనారు...ఒకటే కేకలు... నన్నుచూసి నా మీదికి ఎగబడి...పిల్లని అన్యాయం చేస్తున్నావ్...పిల్ల కోరిందల్లా చేస్తావా చెయ్యి .. లేకపోతే నిన్ను సర్వనాశనం చేస్తానని. సరేచేస్తానని మొక్కుకున్నాను బాబూ...అప్పుడు స్వామివారు ఏమన్నారంటే—ఈ వూళ్లో జగన్నాధం అని వున్నాడు...వాడి అబ్బాయికి మీ అమ్మాయిని ఇచ్చి పెళ్లిచెయ్యరా...శుభం జరుగుతుంది అని సెలవిచ్చారు. అంటే. నేనన్నాను- "వారు పెళ్లికి ఒప్పుకోటంలేదు స్వామీ...నేనేం చేయను"అన్నాను అంటే—"నీ కదంతాఎందుకు అక్కడ అంతా నేను ఏర్పాటుచేశానువెళ్లు,వెళ్లు" అని నన్ను తరిమారు...తిన్నగా ఇక్కడికి వచ్చేశాను. తర్వాత అన్నిటికీ మీరేఉన్నారు...మీరు ముంచినా...పాలముంచినా- మీరేదాతలు.

స: నాన్నా ఇందాక అంతర్వాణి పంపుతానన్నది యీ యన్నేనేమో

జ: ఛీ! వీడా వీణ్ణెందుకు పంపుతుంది-అంతర్వాణి

స: అబ్బా!(అని మళ్ళీగుండెపట్టుకొని)నాన్నా! నాన్నా! అంతర్వాణి మళ్ళీ ఏమిటో చెబుతుంది- ఆ(ఏమిటి ఈయన కూతుర్నేనా...అలాగే...ఏ(విటీ మా నాన్నఒప్పుకోడంటూవా నేనుచెప్పిఒప్పిస్తాగా-శాం తించు అంతర్వాణీ! నాన్నా, అంతర్వాణి బాధ పడ లేకుండా ఉన్నాను... ఒప్పుకోనాన్నా.

జ: ఆ( ఏమిటీ! ఇంత బతుకూ బతికి కోడల్ని సినీ మాల్లోకి పంపేదా!

స: ఆ( ఏమిటి అంతర్వాణీ! నాన్నా ఒప్పుకోకపోతే ఊరుకోవా! నాన్నా నాన్నా ఒప్పుకోనాన్నా! అంత ర్వాణి బాధ పడలేకుండా వున్నాను.

జ: అసంభవం! ఆరునూరయినా జరగడానికి వీల్లేదు. ...ఉ ఉ ఉ...ఏమిట్రా నాగుండెలోగూడా ఏదో గురగుర లాడు తుందీ...

స: అదేనాన్నా అంతర్వాణి ... మొదట్లో అలాగే ప్రారంభమౌతుంది.

పి: అంతేనండి...మా అమ్మాయికిఅంతే.... ఉండి ఉండి ....రయిలుబళ్ళు నడిచినట్లే .. ఇక కేకలేమిటి ఎగరడమేమి .... అమ్మోయ్.... బాబోయ్ ... ఇంతే మన్నావుందా...అంతామీదేభారం...,పాలముంచినా నీటముంచినా - ఎమో బాబు, మీఇష్టం!

స: ఒప్పుకో నాన్నా! ఊఁ! సరేఅను! లేకపోతేక్ర మంగా! అబ్బా చచ్చాన్రాబాబూ! నాన్నా ఒప్పుకోవూ నన్ను బాధపెడుతుంది, ఒప్పుకో.

పి: రక్షించండి పంతులుగారూ... మా అమ్మాయి కోసం కాక పోయినా... మీ వంశవృద్ధికి...అను గ్రహించండి...అబ్బాయి అల్లాడి పోతున్నాడు.. రక్షించండి.

జ: సరేలే! కానివ్వండి...అంతర్వాణి అంతగా చెబు తున్నప్పుడు ఒరేయ్ ఇకనైనా కొక్కిరాయివేషాల మాని అంతర్వాణి ఆదేశప్రకారం నడుచుకో.

స: నాన్నా! అంతర్వాణిమాటకు అడ్డులేదు...అంత ర్వాణి ప్రబోధం అక్షరాల అమలు జరుపుతాను. కనుక అంతర్వాణి ఆదేశానుసారం రాబొయ్యే నాసాంఘికచిత్రంలో కథానాయిక నాభార్యామణి- పతివ్రతాశిరోమణి, శ్రీమతి వద-

జ: ఊఁ! ఏమన్నాచెయ్యి... అంతర్వాణి ఆదేశానికి మట్టుకు అడ్డుండకూడదు....అయినా మానవు మాత్రులం మనవల్ల ఏమవుతుంది? అన్నిటికీ వాడేవున్నాడు పరమాత్ముడు. అంతావాడిదే. ఆ లీలామానుష విగ్రహుడు, ఆర్తరక్షణ పరాయ ణుడు, ద్రౌపదీమానసంరక్షకుడు!...ఆహా అంతా వాడిమహిమే. (భక్తిపారవశ్యంలో కళ్లుమూసి భజనచేస్తాడు) రామ రామ రామసీతా రామ... రామ...రామ...

(పిచ్చయ్యకూడా భజనచెయ్యటానికి చేక్త్రోపొడిచి) రామరామ రామసీతా! ...ఆహా( చూచావా నాన్నా! అంతర్వాణికిజై! అంతర్వాణి జిందాబాద్! (గట్టిగాకేకవేస్తాడు)

[తెర]

## పాత్రలు

1 ప్రిన్సిపాల్

2 తెలుగు లెక్చరర్

3 లెఖ్ఖల లెక్చరర్

4 ఫిజిక్స్ లెక్చరర్

5 హిస్టరీ లెక్చరర్

6 శఠకోపం (పాతవిద్యార్థి)

7 ప్యూన్

# వాపస్

(ఏకాంకిక)

ప్రవేశం : ప్రిన్సిపాల్ గారి ఆఫీసుగది.

ప్రిన్సిపాలుగారు కూర్చీలోకూర్చుని, ఏవో కాగి తాలు తిరగేస్తుంటారు.

ప్రవేశం.- బంట్రోతు.

ప్రి! ఏమిట్రా ?

బం: తమరికోసం ఎవరో వచ్చారండి, అర్జంటు పనంట రావొచ్చేమొ కనుక్కోమంటుంచారు.

ప్రి. యీ పిల్లల తండ్రులకి వేళాపాళాలేదు Inter Views వేళలు Notice boardలో కూడా వేయిం చాను, వెళ్ళి చూచుకోమను ఒక్కసారి.

బం: చిత్తం, చిత్తం. చెప్పానండి కాని ఆయన పిల్లలతండ్రి కాడంటండి.

ప్రి: మరి, పిల్లవాడా? విద్యార్థా?

బం: అదీకాదండి ! బాగా, గడ్డంగూడా పెరిగివుందండి.

ప్రి: పిల్లవాడితండ్రీకాక, పిల్లవాడూకాక ....మరి ఎవ డోయ్ వీడు ?

బం: "శఠకోపం వచ్చాడని ప్రిన్సిపాల్ గారితో చెప్పు" అన్నాడండి. అంతే.

ప్రి: శఠకోపం ! (ఆలోచించి) ఎలావున్నాడు చూట్టా నికి ? ... తెలివిగలవాడులాగా వున్నాడా- లేక మొద్దబ్బాయిలాగున్నాడా ?

బం: కొంచెం తెలివిగల బుర్రేననుకుంటానండి.

ప్రి: (స్థిమితపడి) సరే. అయితే వీడు యిన్స్పెక్టరు మాత్రం కాడు! ఖాయం! .. లోపలికి రమ్మను!

బం: చిత్తం (అని బయటికి వెళతాడు).

(ప్రవేశం: శఠకోపం; బాగా గడ్డం పెరిగి వుంటుంది. 40 లోపు వయసు. చిరిగిన బట్టలు. పరిషిదృఢంగానూ, తల బిరుసుగాను కనబడతాడు.)

శ: నమస్తే. ప్రిన్సిపాలుగారూ!

ప్రి: (లేచి) నమస్తే! ఏం పనిమీద వచ్చారు?

శ: నేను శఠకోపాన్నండి! (కాసేపుఆగి) ఏం, గుర్తించలేదానన్ను?

ప్రి: (తలపూపుతూ) లేదండి! గుర్తుకురాలేదు.

శ: నిజమేలెండి: నేను చాలా మారిపోయాను.... మీ కాలేజి రికార్డులు వెతికితే అందులో దొరుకుతుంది నా పేరు.

ప్రి: (ఆశ్చర్యంతో) కాలేజీ రికార్డులా?... ఎందుకు?

శ: (బిగ్గరగా, స్పష్టంగా) నాపేరు శఠకోపమండి, ప్రిన్సిపాలుగారూ! నన్నే మరిచిపోయారు?

ప్రి: అయితే కావచ్చునయ్యా! దానికీ దీనికీ ఏమిటి సంబంధం?

శ: అయితే యింతకూ నాపేరే మీకు జ్ఞాపకం లేదంటారు — అంతేనా? —(ఆలోచించి, హుం అని తలవూపుకుంటాడు) మీకు జ్ఞాపకం వుండి వుండదు లెండి. ఒకవేళ వున్నా లేనట్లే నటిస్తారు...

అయితే చెప్తావినండి. నేను 15 సంవత్సరాల క్రితం మీ కాలేజీలో చదువుకున్నాను.

ప్రి: (ఆశే ఆసక్తిలేనట్లు) ఓ! ఆలాగా! అయితే యిప్పుడేమంటారు? Character Certificate కావాలా?

శ: (జేబులోంచి కాగితంతీసి ప్రిన్సిపాలుగారి బల్లమీద పడేస్తూ) యిదివరకిచ్చిందే పరమదండుగను కుంటుంటే — యింకోటికూడా ఎందుకు, నా బొందమీద? — నే నొచ్చింది అందుకు కాదండి. సార్!

ప్రి: అయితే మరెందుకు?

శ: (గొంతుసవరించుకుని గట్టిగా, స్పష్టంగా) 15 సంవత్సరాలక్రితం నాచదువుకోసం మీకాలేజీకి కట్టిన జీతం యావత్తు అణాపైసలతో సహా వాపస్ యిచ్చివెయ్యమని అడగడానికి వచ్చాను. ఇది— మీకాలేజీ పాతవిద్యార్థినైన నా జన్మహక్కు!

ప్రి: (ఆశ్చర్యంతో) ఏమిటీ—కాలేజీకికట్టిన జీతం తిరిగి యిచ్చెయ్యమంటావ్?

శ: అణాపైసలతో సహా యిప్పుడు కక్కమంటాను! నేనూ ఏలక్షాధికారినో అయితే. 'పోనీలే' అని వూరుకుందును. బీదముండాకొడుకుని — డబ్బు చాలా అవసరం నాకు!

ప్రి: నువ్వుచెప్పేది నాకేమీ అర్థంకావడంలా!

శ: (స్పష్టంగా) కాలేజీకి నేనుకట్టినజీతం తిరిగి నాకు

వాపస్ యిచ్చేయ్యమంటున్నాను. ఏం. అచ్చుతెను గులో చెప్పినా అర్థంకావడంలా?

ప్రి. ఏం, ఎందుకివ్వాలి?

శ: ఎందుకా? నేను కట్టినడబ్బుకి తగిన ప్రతిఫలం నాకు ముట్టలేదు గనుక! —యిదుగో మీ సర్టిఫికెట్టు! యిందులో నేను B. A. ప్యాసయ్యానని, చాలా తెలివిగలవాణ్ణనీ ఏమేమో వ్రాశారు. యిదంతా పచ్చిఅబద్ధం! ఒఠ్ఠి Gass. నేనుమీకాలేజీలో నేర్చుకున్నది ఆవగింజంతయినా లేదు. నా డబ్బు నాకిచ్చేయ్యం !

ప్రి: యిదుగో! అబ్బాయ్! చూడు! నువ్వుచెప్పేది ఏమీ సబబుగాలేదు, యిలాంటిది నాజీవితంలో ఎక్కడా వినలేదుగూడాను. చెప్పేదాన్లొ ఏమన్నా అర్థముండాలా?

శ! అర్థంలేదూ?—నిజమే! ఎలావుంటుంది!నాబుర్రలో తెలివి అనేది ఏమన్నా మిగలనిస్తేగామీరు! నాలుగేళ్లు చదువుచెప్పి. చివరికి నన్నొక గాడిదగా తయారుచేసి, దేశంమీద తోలారు— యీరోజు మా 'హనుమంతు'గారు చెప్పేదాకా (నేనుగాడిద నన్నసంగతి) నాకేతెలియలేదు. యీవుపాయం కూడా వాడే చెప్పింది.

ప్రి: ఏ వుపాయం?

శ: అట్లా అడగండి చెప్తాను—నేను రిక్షాఎక్కి బజారువెంబడే వస్తున్నాను, నాలుగు రాళ్లు సంపాయించడం ఎలాగా అని ఆలోచిస్తూ, యింతలో

షూ హనుమంతు కనిపించాడు. ఎక్కడికో హడా వుడిగా పోతున్నాడు. "ఏం బ్రదర్, ఏమిటి విశే షాలు" అన్నాను. వాడు హడావుడిగా, "యివాళ New york Cotton marketలో మనకి మూడు వేలొచ్చాయి. వసూలుచేసుకోడానికి పోతున్నాను" అన్నాడు. నేను ఆశ్చర్యంతో 'Cotton వ్యాపారం' చేస్తున్నావేంరా అన్నాను. వ్యాపారంకాదురా, 'Bracket Company' అన్నాడు. నాకేమీ అర్థంకాక తెల్లమొఖంవేశాను, 'Cotton market' అంటే తెలీదురా? పైగా యింతడబ్బు తగలేసి B. A. కూడా చదివావు. ఎవడ్రా నీకు చదువుచెప్పిన సన్నాసి! పోయి ఆపంతులికిచ్చిన డబ్బైనా తెచ్చుకో, కరువురోజుల్లో అక్కరకన్నావస్తుంది' అని గబగబా వెళ్ళిపోయాడు. నాతెల్లముఖం మరీ తెల్లబడింది. రిక్షావాడుగూడ నామొఖంచూచి "Bracket Company తెలీదుబాబూ? పైగా సదువు కున్నారుగూడాను!" అన్నాడు. నాకు తల నరికేసి నట్టయింది. హనుమంతుగాడిచ్చిన సలహాఅమలు పరచాలని నిశ్చయించుకున్నాను. రిక్షాలో తిన్నగా మీదగ్గరకొచ్చాను. కాబట్టి దయచేసి నాడబ్బు నాకిచ్చేస్తే వెళ్ళిపోతాను. —చాలాడబ్బు కట్టివుం టాను— సరిగా లెక్కలు చూడండి.

ప్రి: (నిర్ఘాంతపోయి, ఏమనాలో తెలీక) యిదుగో అబ్బాయ్! నీలాగా అడిగినవాళ్ళు యింతవరకె వ్వరూలేరు. బహుశా హనుమంతు...

శ: అహాఁహాఁ. హనుమంతు నాకు ప్రాణస్నేహితుడు. వేళా కోళాలాడే రకం కాదు. మీరిచ్చే డబ్బులో వాడికికొంత Present గూడా యివ్వదల్చు కున్నాను.

ప్రి: (కోపంగా) ఏయ్, యిదేం ఆషామాషీ అనుకున్నావా ? ...

శ: ఆషామాషీకాదు—అతి Serious గా మాట్లాడుతున్నాను. మీరు గనక నాకిప్పుడు డబ్బివ్వకపోతే, దేశంలో నాలాటివాళ్ళ నందరినీ పోగుచేసి, ఒక సంఘంపెట్టి, విద్యాశాఖా మంత్రిగారి దగ్గరకి Deputation lead చేస్తాను. — మీరు నా దగ్గర బోలెడంత డబ్బు తీసుకొన్నారు. కాని దమ్మిడీ యెత్తు చదువుకూడా చెప్పలేదు. పైగా నన్ను ఎందుకూ పనికిరాని ఒక చవటవెధవగా తయారు చేశారు నన్ను మోసంచేశారు। నన్ను దోచుకు తిన్నారు.

ప్రి: నీకు పూర్తిగా మతిపోయింది....

శ: అసలు - సుతివుంటేగా పోవడానికి ? వున్నమతి కాస్తా మీ చదువుతోనే పోయింది.

ప్రి: (అనునయంగా)యిదుగో శఠకోపం! నువ్వువెళ్ళు! నీ విషయంతరువాత తీరిగ్గా ఆలోచిస్తాను.

శ: No ! No ! ఆ పప్పులేం వుడకవండి సార్ ! అంత తేలిగ్గా కదిలే ఘటం కాదిది. ఆజ్ఞాపైసలతోసహా పరిష్కారం కాందే యిక్కడిసించి చస్తేకదలను.— నేను మీకు డబ్బుకట్టింది, ఏదో

నాలుగురాళ్లు సంపాదించుకునేపాటి చదువు చెప్తా రనేగా ! — కాని మీరేం జేశారు? నన్నొక చవటగా తయారు చేశారు. మీ పాడు చదువు లేక పోయినా బాగుండు! - ఏదో కూలి తట్టలు మోసు కొని బతికేవాణ్ణి ! యిప్పుడు ఆ యోగ్యతగూడా లేకుండా చేశారు. కాబట్టి నా డబ్బు నాకిచ్చేయడం మీ కనీస ధర్మం ! అసలు, దీనికింత Argument అనవసరం !

ప్రి: అదేమిటయ్యా, లక్షణంగా B. A. Pass అయి, 'నాకేమీ చేతగాదు. నేను చవటని' అంటావేమిటి?

శ: నేను చవటనని నేనే చెబుతావుంటే, కాదని మీరు దబాయిస్తారేమిటి! అయినా, నాకేమిటి? నేను ఎందుకూ పనికిరాని చవటనని — ప్రపంచానికంతకూ తెలుసు ! ఉద్యోగంకోసం ఎన్నిపాట్లు పడ్డాను?/ షాహుకారు దగ్గరకెళ్ళి గుమాస్తాపని యివ్వమన్నాను. 'పదలానికి ఏబులాలెన్ని' అని అడిగాడు. తెల్లముఖంవేశాను ! చివరికి మంగలిషాపులో కెళ్ళి 'వుద్యోగం కావాల'న్నాను. 'క్షవరం చేయగలవా' అన్నాడు. 'నాకునేను చేసుకుంటాగాని' యితరులకి క్షవరం చేయడం చేతగా'దన్నాను అయితే Unfit పొమ్మన్నాడు.- యింతెందుకు ? Cotton Market అంటే ఏమిటో తెలీని వెధవకి, ఎవడిస్తాడు వుద్యోగం ?

ప్రి: అదంతా మాకనవసరం. నువ్వు పరీక్షల్లో Pas అయ్యావు. నీకు Degree యిచ్చేశాం. అంతే!

శ: అవన్నీ అర్ధంలేని పరీక్షలు! నన్ను చిన్నవాణ్ణిచేసి మోసంచేశారు. కావాలంటే యిప్పుడు పెట్టండి పరీక్ష! నేను తప్పుతానో లేదో చూద్దురుగాని!

ప్రి: నీకు మతేమన్నా పోయిందా! దేశంలో Students అందరూ 'పరీక్షలు వద్దో' అని గోలపెడుతుంటే- నువ్వు పరీక్షలు కావాలంటావేమిటి?

శ: నా డబ్బు నాకిచ్చేస్తే, నాకూ అక్కర్లేదు పరీక్షలు!

ప్రి: అయితే యింతకూ యిప్పుడు పరీక్ష పెట్టాలసిందే నంటావ్?

శ: తప్పకుండా!

ప్రి: యిదెక్కడి ప్రళయంరా బాబు! నీలాంటి పిడుగుని నే నెక్కడా చూళ్ళా!—అయితే యీ విషయం మా Staff తో Consult చెయ్యాలి. నువ్వు కొంచెం బయట కూర్చో!

శ: ఓ. అలాగే! (లేచి) తొందరగా తేల్చండి! నా కవతల మళ్ళీ పనివుంది. యింట్లో బియ్యం లేవు. బియ్యం కొనుక్కెళ్ళాలి. (అంటూ వెళతాడు).

ప్రి: ఏయ్! peon! peon!

బం: సార్!

ప్రి: ఒకసారి Staff అందర్నీ యిక్కడికి రమ్మను. చాలా అర్జంటు అని చెప్పు!—ఊం. త్వరగా!

బం: చిత్తం! కొంతమంది వెళ్ళిపోయినట్టున్నారండి.

ప్రి: ఉన్నవాళ్ళనే పిలవ్వోయ్! బం:-(వెళ్ళిపోతాడు).

ప్రి: (ఉపన్యాసం రిహార్సలు వేసుకుంటాడు) ఓ నా ప్రియమైన Staff మెంబర్లారా! ఒక అతి క్లిష్టమైన

వ్యవహార పరిష్కారార్థం మిమ్మల్ని పిలుపనంపాను. ఇది చాలా అపూర్వమైన విషయం. నా ముప్ఫయ్ యేళ్ళ వుద్యోగ జీవితంలో యిలాంటి విచిత్ర విషయం కనీ వినీ యెరగను: యికముందు నా బొందిలో వూపిరి వుండగా వినబోనని గూడ బల్లగుద్ది చెప్పగలను.

(ప్రవేశం: తెలుగు, హిస్టరీ. లెక్కల, సైన్సు నలుగురు లెక్చరర్లు, వారి ముఖాలలో ప్రత్యేకత వుంటుంది)

నలుగురూ: (ఆదుర్దాగా) ఏమండీ! ఏమిటి సంగతి! ఇంత హడావుడిగా పిలిపించారేం?

ప్రి: యింకేముందండి? కొంప మునిగింది!

తె-లె: యేం! కుర్రాళ్ళు Strick Notice యిచ్చారా!'

హి-లె: ఆకాశరామన్న వుత్తరా లేమన్నా వచ్చాయా?

ప్రి: అవేం కాదండి! కూర్చోండి చెబుతాను. నా ముప్ఫయ్యేళ్ళ వుద్యోగజీవితంలో కనీవినీ యెరుగని వింత విషయం ఒకటి జరిగింది. యిప్పుడే శరకోపం అనే మన కాలేజీ పాతవిద్యార్థి ఒకడు వచ్చాడు. నా ముప్ఫయ్యేళ్ళ వుద్యోగ జీవితంలో కనీ వినీ యెరుగని ఒక వింత కోరిక కోరాడు: (బిగ్గరగా) అది అక్రమం; అధర్మం! అసంభవం! ఘోరం!

లెక్చరర్లుఅంతా: ఏమన్నాడండి! చెప్పండి!

ప్రి: 15 సంవత్సరాలక్రితం వాడు కాలేజీకి కట్టిన, జీతం యిప్పుడు తిరిగి వాపస్ యిచ్చేయ్యాలట!

యీ క్లిష్ట సమస్యపై మీ అభిప్రాయాలు, సల
హాలు తీసుకోడానికే మిమ్మల్ని పిలిపించాను.

ఫిజిక్సు: డబ్బెందుకివ్వాలి తిరిగి ?

ప్రి: వాడికి మనమేం చదువుచెప్పలేదట! పైగా ఎం
దుకూ పనికిరాని గాడిదగా తయారు చేశామట.
అందుకని వాడిడబ్బు వాడికిచ్చెయ్యాలట!

హిస్టరీ: ప్రపంచ చరిత్రలో యిలాటి విషయం ఎన్నడూ
జరుగలేదు. యిక జరగబోదు. ధర్మాన్ని నాలుగు
పాదాల నడిపిన శాతవాహన రాజుల కాలంలో
గూడా ...

ఫి. లె: Law of Conservation of energy ప్రకారం ఒక
విద్యార్థి బుర్రలోనికి మనం కొంతకాలంలో ఎంత
చదువును ఎక్కించగలుగుతామో, అదేకాలంలో
అదేవిద్యార్థి అంతే చదువును బయటకు త్రోసి
వేయ గలడు....

లె. లె: ఇంతకూ అతనికి యివ్వవలసిన మొత్తం అసలే
యివ్వాలా? Interest కూడా యివ్వాలా? యిస్తే
Compound యింటరెస్టా, లేక Simple యింట
రెస్టా?

తె లె: యింతకూ ఆపాత విద్యార్థి యెందున్నవాడు?

ప్రి: అదుగో! వరండాలో వుండమన్నాను. వాడికీ
క్షణంలో మళ్ళీ పరీక్ష పెట్టాలట. అన్నిటిలోనూ
తప్పి మనంవాడికేమీ చదువు చెప్పలేదని నిరూపి
స్తాడట. తొడచరిచి సవాలు చేస్తున్నాడు.

లె-లె: మళ్ళీ పరీక్ష ?......ప్రిన్సిపాల్ గారూ ! శఠకోపా నికి మళ్ళీ పరీక్ష పెట్టినందువల్ల మనకేమీ నష్టం లేదు. వాడు తప్పాడా మన కంఠంమీది కొస్తుంది: కాబట్టి వాడు తప్పకుండా చూడాలి మనం ! వాడు జీవితంలో చాలా కాకలు తీరిన ఘటంలాగ కని పిస్తున్నాడు. కాబట్టి అంతంత మాత్రాన మనకి లొంగడు. మనల్నందరినీ దబాయించి, బోల్తా కొట్టించి, డబ్బు కాజెయ్యాలని చూస్తున్నాడు. కాబట్టి మనం అప్రమత్తులమై మెలగాలి. మన తెలివితేటలు చూపాలి. మన మంతా ఏకం కావాలి! యిలాటి విద్యార్థుల దాడినుండి పంతుళ్ళ ప్రాణాలు కాపాడాలి ! జై పంతుళ్ళ సంఘానికి!

తె-లె: అయిన ప్రస్తుత కర్తవ్యంబు ?

లె-లె: ఏముంది ? మన మందరం ఏకం కావాలి ? వాడు పరీక్షలో తప్పాడంటే, మన కొంప లంటుకుంటై: కాబట్టి వాడు తప్పకుండా చూడాలి : వాడు తప్పా డంటే వాడే గెల్చాడన్నమాట, మనమే ఓడిపో యామన్నమాట, వీ డివ్వాళ తప్పాడంటే, రేపు యిలాటివాళ్ళు పదిమంది తయారై మాడబ్బు మా కియ్యమంటారు. కాలేజీ దివాళ తీస్తుంది. మన వుద్యోగా లూడతై. కాబట్టి యిది అంటు వ్యాధిగా వ్యాపించకుండా చూడాలి......ఏమీ లేదు. అం దరం వాణ్ణి తేలికప్రశ్న లడుగుదాం.

హి-లె: తప్పటానికి సిద్ధంగా కూర్చున్నవాడు, తేలిక ప్రశ్నలకిమట్టుకు సరైన సమాధానం చెబుతాడా ?

లె-లె: మార్కులు వేసేది మనమేకదటయ్యా !—వాడు ఏ సమాధానం చెప్పినా సరే, సమర్థించి రైటని, పూర్తి మార్కులు వేసేద్దాం. వాడిరోగం కుదురుతుంది. మనం నలుగురం ఒకమాటనుకుంటే, తప్పటానికి వాడి తాత తరమండీ ?

ప్రి : అయితే యికవాణ్ణి పిలిపించమంటారా ?

అందరూ : ఊఁ పిలిపించండి !

ప్రి : Peon ! Peon !

బం : సార్.

ప్రి : అతన్ని లోపలికిరమ్మను.

(బంట్రోతు వెళుతాడు. లెక్చరర్లు కోట్లు, తలపాకాలు సర్దుకుంటారు. తెలుగు లెక్చరర్ ఒకపట్టు నస్యం పీలుస్తాడు.)

(ప్రవేశం : శరకోపం అందర్నీ ఎగా దిగా తీక్షణంగా చూస్తాడు,)

లెక్కలు : ఆ ! రానాయనా ! ఆకుర్చీలోకూర్చో :

శ : (పెడసరంగా) నేకూర్చోను ! నిలబడే వుంటాను.

లె లె: ఫరవాలేదు. కూర్చోఅబ్బాయ్.

శ : నా యిష్టం !

లెక్కలు : (గుక్కతిప్పుకుని) ఓహోహో ! ఏమివినయ విధేయతలు : మాష్టర్లముందు నిలబడే వుండాలనే యీవిద్యార్థి కడు బుద్ధిమంతుడు. ప్రిన్సిపాల్ గారూ ! వినయ విధేయతల్లో యితనికి Cent per-Cent వేయండి.

మిగతావాళ్లు : ఓ తప్పకుండాను ! మాకందరికీ అంగీ కారమే.

ప్రి : (ఏదో వ్రాసుకుంటాడు)

శ : (నిర్ఘాంత పోతాడు. స్థిమితపడి, తలవూపుతూ, సరే కానియ్యండి ! మిగతా పరీక్షకూడా కానియ్యండి.

ప్రి : యిదుగో ! నీ Group ఏమిటబ్బాయ్.

శ: Intermediate లో 1st group. B. A లో Histories !

ప్రి: అయితే ఏ సబ్జక్ట్సులో పెట్టమంటావ్ పరీక్ష ?

శ: అన్ని Subjects లోనూ పెట్టండి.

ప్రి: English lecturer గారు లేరు. అయినా మన స్వతంత్రభారత దేశంలో English కు ప్రాధాన్యత తగ్గింది గాబట్టి English లో పరీక్షలేదు. కాబట్టి తెలుగు, ఫిజిక్సు......

శ: (Impatiently) తెలుగు, Physis, Mathematies Chemistry, History, Geogrophy —మీ యిష్టం! ఏదైనా సరే ! Ready !— పని మట్టుకు త్వరగా తేల్చి, నా డబ్బు నా కిచ్చి పంపెయ్యండి !

ప్రి: అయితే ముందు History ! History మాస్టారు కానివ్వండి !

హిస్టరీ : (లేచి) అబ్బాయి ! నాప్రశ్నలకు సూటిగా సమాధానంచెప్పు ! రామాంజనేయ యుద్ధం ఎవరెవరికి జరిగింది ?

తెలుగు : (గభాలునలేచి) అది చరిత్రకు సంబంధించి

కాదు ! పురాణాల్లోది కాబట్టి సాహిత్యానికి సంబంధించింది.

హిస్టరీ : పురాణయుగంకూడా చరిత్రలోదే కాబట్టి పురాణాల్లోని యుద్ధాలు చరిత్రలో జరిగినవే ! కాబట్టి ఆప్రశ్న అడగటానికి నాకు హక్కుంది.

తెలుగు : నేనొప్పుకోను. వాల్మీకి రామాయణంలో.......

ప్రి : యిదుగో ! చరిత్రకూ, సాహిత్యానికి అవినాభావ సంబంధంవుంది· చరిత్రలేందే సాహిత్యంలేదు. సాహిత్యంలేందే చరిత్రలేదు. కాబట్టి మీరు రాజీపడాలి. హిస్టరీమాస్టారూ ! మీప్రశ్న అడగొచ్చు !

తెలుగు : (కోపంగా కూర్చుంటాడు.)

హిస్టరీ : చెప్పబ్బాయ్ ! రామాంజనేయయుద్ధం ఎవరెవరికి జరిగింది ?

శ : మీకు, తెలుగు మాస్టారికి !

హి : (కాసేపు తడబడి అందరి ముఖాలు చూస్తాడు) (గుక్కతిప్పుకుని) భేష్ ! Correct! తెలుగు మన మాతృ భాష ! కాబట్టి తెలుగు మాస్టారు మనకు తండ్రివంటివారు ! పూజ్యులు ! గురుతుల్యులు ! రామునికి హనుమంతునికిగల సంబంధమే నాకూ తెలుగు మాస్టారికి అన్వయించి అతి చాకచక్యంగా చెప్పాడు, గాబట్టి యితనికి హిస్టరీలో నూటికి 80 మార్కులు వెయ్యండి ! ప్రిన్సిపాలుగారు !

శ: (కోపంతో) కాదు, కాదు ! తెలుగుమాస్టారు రాముడుగాదు ! హనుమంతుడు !

తె: (కోపంతోలేచి) అనవసర ప్రసంగం చెయ్యకు ;
ఫి: **Answer to the Point !**
శ; (కోపంతో) సరే! కానియ్యండి! మిగతా **Subjects**లో కూడా అడగండి! ఎలా **Pass** అవుతానో చూస్తాను.
ప్రి: ఆఁ ఫిజిక్సుమాస్టారూ! కానివ్వండి!
ఫి లె: (లేచి) అబ్బాయ్! ఆర్కిమెడీస్ సూత్రాన్ని కనిపెట్టిందెవరు?
శ: (కోపంగా) (Pause) నేనే!
ఫి లె: **Brilliant ! indirect** గా **Correct Answer** చెప్పావు మొట్టమొదట తన సూత్రాన్ని కనిపెట్టినపుడు ఆర్కిమెడీస్ 'నేనేకనిపెట్టాను నేనే కనిపెట్టాను' అని కేకలేస్తూ వీధులెంట పడ్డాడట? —ప్రిన్సిపాల్‌గారూ! యితనికి **Physics** లో నూటికి నూరు మార్కులు!
శ: (తెల్లబోయి) (మళ్ళీ తెప్పరిల్లి) - అయితే ఆది కనిపెట్టింది. నేను కాదు!
ఫి: (ప్రిన్సిపాలుతో) మొఖమాటపడుతున్నాడు--అతని మాటల కేంలెండి. మార్కులు వెయ్యండి.
శ: అన్యాయం! అన్యాయం! (అని అరుస్తాడు)
ఫి: అన్యాయ మేమీలేదు లేవయ్యా! నువ్వే కనిపెట్టావని ఒప్పుకున్నాంగా, ఆర్కిమీడిస్ సూత్రం!
ప్రి: ఆఁ, ఫిజిక్సులో పరీక్ష అయిపోయినట్లే — యిక తెలుగులో కానివ్వండి.
తె-లె: విద్యార్థీ! నిన్ను రెండు ప్రశ్న లడిగెదను.

జాగరూకుండవై, ప్రత్యుత్తరం బొసంగుము.

శ: అడిగే దేదో త్వరగా అడగవయ్యా!

తె: మొల్లరామాయణం వ్రాసినవా రెవరు?

శ: మీ నాయనమ్మ.

తె: (కోపంతో) ఎయ్! సరిగా చెప్పు.

ప్రి: యిదుగో, తెలుగు మాస్టారూ! కోప్పడగూడదు (అని చాటుగా సైగజేస్తాడు).

తె: (గుటకలు మింగి, తమాయిస్తాడు) మళ్ళీ చెప్ప బ్బాయి.

శ: నే చెప్పను. యిందాక చెప్పినప్పుడు ఎందుకు వినలా?

తె: (తటపటాయిస్తాడు) అయితే యింకో ప్రశ్న అడుగుతాను. యీ క్రింది వ్యాకరణ సూత్రమును పూర్తిజేయుము—"ఉత్తునకు అచ్చు పరంబగునపుడు—

శ: తెలుగు మాస్టారి ముక్కులో నశ్యంబు నిత్యంబగు.

(అంతా నవ్వుతారు)

తె: (కోపం దిగమింగి) భేష్! మహాబాగా చెప్పావు. 'సంధి నిత్యంబు' అనుటకు బదులు అదే అర్థం వచ్చేటట్లు, నాకు అన్వయించి అతి రమ్యంగా చెప్పాడు. ముక్కునకూ, నశ్యమునకూ ఏవిధంగా నిరంతర సన్నిహిత సంబంధమున్నదో, ఆవిధంగానే ఉత్తునకు దానికి పరమైన అచ్చునకు గూడ సంధి నిత్యమని దానిభావము. వ్యాకరణ

సూత్రమును యింత నర్మ గర్భంబుగా చెప్పిన వారు అరుదు. వ్యాకరణంబున యీ విద్యార్థి చిన్నయసూరిని గూడ మించుచున్నాడు. కాబట్టి యితనికి నూటికి నూటపది మార్కులిచ్చినను చ-డుగలేదు. (అని కూర్చుంటాడు).

శ: (కోపంతోలేచి) యిది చేతగానితనం! మోసం. నాపరీక్ష పూర్తికాలేదు.

ప్రి: యిక లెక్కలు మాత్రం మిగిలి వుంది.

శ: మీరుగూడ కానియ్యండి.

లె: (లేచి) అబ్బాయీ! నేను రెండు ప్రశ్నలు మాత్రమే అడుగుతాను. అందులో ఏ ఒక్క దానికైనా సరైన జవాబు చెబితే, నేను నూటికి నూరు మార్కులు వేస్తాను.

శ: అడగండి....త్వరగా - మళ్ళీ నేవెళ్ళిపోవాలి.

లె: మొదట ఒక తేలిక ప్రశ్న అడురుతాను—2349 మగ్గములుకలిగిన ఒక గుడ్డల మిల్లులో ఒక్కొక్క మగ్గము మీద 24 గంటలకు 136 గజముల గుడ్డ తయారైనచో—ఆమిల్లులో 244 రోజులలో తయారయ్యే గుడ్డ ఎంత? ఆ గుడ్డతో ఒక్కొక్క పోలీసుటోపీకి 4 గజముల 6 వీసముల గుడ్డ చొప్పున ఎన్ని పోలీసుటోపీలు తయారు చేయ వచ్చును?

శ: ఓస్! యింతేగద! చెబుతావినండి. - ఒక లక్ష-

లె: ఊ! (రైటన్నట్టు తలవూపుతాడు.)

శ: 34 వేల—

లె: ఊం.

శ: 9 వందల—

లె: ఊం.

శ: యనభైమూడు.

లె: తప్పు! యనభైమూడుగాదు - యనభైనాలుగు. —వెయ్యండి. సున్నావెయ్యండి, మార్కులు.

శ: (సంతోషంతో) బలే! బలే! తప్పాను. తప్పాను (అని కేకలేస్తాడు)

(అందరూ విస్తుబోతారు)

ప్రి: (కంగారుగా) మాస్టారూ! తొందరపడుతున్నారు అయినా ఒక్కటే గదండి అతను తప్పుచెప్పింది.

లె: (కచ్చితంగా) ఒకటిగానివ్వండి, అరగానివ్వండి. తప్పు తప్పే!

ప్రి: మాస్టారూ! తొందిరపడుతున్నారు,

మిగతామాస్టర్లు:— మాస్టారూ! మరచిపోతున్నారు.

లె: అదంతా పనికిరాదు. నేను చాలా కచ్చితం మనిషిని. యితనికి ఒక్కమార్కుగూడ వెయ్యను. యితను తప్పాడు,

శ: తప్పాను. మాస్టారు! ఖచ్చితంగా తప్పాను (ప్రిన్సిపాలుతో) యియ్యండి! నా డబ్బు నాకిచ్చెయ్యండి: ఊం!

లె: యిచ్చెయ్యండి: ప్రిన్సిపాలుగారూ! అణా పైసలతో లెక్కగట్టి యిచ్చెయటం న్యాయం! ధర్మం!

ప్రి: మనం అనుకున్న Rules అన్నీ మరచి పోయ్యారూ?

లె: ఏమండోయ్! నన్ను అనవసరంగా మొఖమాట పెట్టకండి.

ప్రి: మా ప్రాణంమీదికి తెస్తున్నారు.

లె: నా పద్ధతిఅంతే! ప్రాణంపోయినా సరే, పని మటుకు ఖచ్చితంగా ఉండాలిసిందే.

ప్రి: (కోపంగా) మస్టారూ!

లె: ప్రిన్సిపాల్‌గారూ! మీకు అధికారంవుంటే మీ దగ్గరే వుంచుకోండి. అంతేగాని, అనవసర విషయాల్లో జోక్యం చేసుకోకండి.

శ: బలే! మాస్టారూ! బలే!

ప్రి: (కోపంగాలేచి) మాస్టారూ! (అని అరిచి బల్ల గుద్దుతాడు)

లె: (Seriousగా) నా వుద్యోగానికి రాజీనామా అయినా యిస్తానుగాని, ఆతనికి ఒక్క మార్కు గూడా వెయ్యను.

శ: (సంతోషంతో) అబ్బ! బలేగా చెప్పారు మాస్టారు!

ప్రి: యిదేమిటండి! (అని తలబట్టుకుని, కూర్చుంటాడు)

లె: అంతే! యిచ్చితీరాలిసిందే!— చెప్పబ్బాయీ! నువ్వు కాలేజీకి కట్టిన జీతం మొత్తం ఎంతో చెప్పు!

శ: (సంతోషంతో) వివరాలతోసహా చెబుతా! వినండి జాగ్రత్తగా Intermediateలో ట్యూషన్ ఫీజు టరముకు 36 రూ॥ చొప్పున మూడు టరము లకు మూడు ముప్పయ్యార్లు 108 రూపాయలు - రెండు సంవత్సరాలకు రెండు 108 లు 216 రూపాయలు - లేబొరేటరీఫీజు టరముకు 5 రూ॥ చొప్పున మూడు టరములకు మూడు అయిదులు 15 రూ॥ లు. రెండు సంవత్సరాలకీ రెండు 15 లు 30 రూ లు. స్పెషల్ ఫీజు: Games లైబ్రరీ: Calender వగైరాలకు టరముకు 6 రూ॥ ల చొప్పున 3 ఆర్లు 18 రూ॥ లు - రెండు సంవత్సరాలకు రెండు 18 లు 36 రూ॥ లు — Physical training fee : టరముకు రూపాయి చొప్పున రెండు సంవత్సరాలకి ఆరురూపాయలు- నేను ఏవో లైబ్రరీ పుస్తకాలు పారేశానని, Test tubes పగలగొట్టానని అబద్ధాలాడి Caution money లో కాజేసింది రు 7-11-0 లు- మొత్తం 295-11-0లు— యిక B. A. లో కట్టినడబ్బు వివరాలు :—

(ప్రిన్సిపాలు, యితరలెక్చరర్లు- నిర్ఘాంతపోయి ఒక్క సారి నిట్టూరుస్తారు)

లె: యికచాలు! యికచాలు ! యిదే నేనడగదల్చు కున్న రెండోప్రశ్న!

(అందరూ విస్తుపోతారు)

శ: (అర్ధంగాక) యింకా ప్రశ్న ఏమిటీ?

లె: రెండు ప్రశ్నలు అడుగుతానని చెప్పలా! యిదే రెండో ప్రశ్న!

శ: (నోరు వెళ్ళబెట్టి గుడ్లప్పజెబుతాడు)

లె: పదిహేను సంవత్సరాలనాడు తాను కాలేజీకి కట్టిన జీతం అణాపైసలతోసహా యీనాడు లెక్కజెప్ప గలిగాడంటే లెక్కలలో యితని ప్రతిభ అమోఘం! అద్భుతం! అపూర్వం!

ప్రి: బలే! మాస్టారూ! బలేగా చెప్పారు.

యితరులు: Very good! Brillant! (అని కేకలేస్తారు).

లె: నాకే అధికారంవుంటే—యితనికి లెక్కల్లో! Nobel prise యివ్వమని Recommend చేసేవాణ్ణి

శ: నోరుముయ్ (కోపంగా).

లె: నువ్వు ఎంతతిట్టినా, యిప్పుడు తప్పడం అసంభవం!

ప్రి: నువ్వు తెలివిగలవాడివి. వద్దంటేమటుకు, వచ్చే మార్కులు ఎలా పోతాయ్?

లె! ప్రిన్సిపాలుగారూ! లెక్కల్లో యితనికి నూటికి 150 మార్కులు వెయ్యండి!

ప్రి: (కాగితంమీదవేసి) బలే! (లేచి) యీ విద్యార్థి అన్ని Subgjcts లోనూ distinctions తో Pass అయినాడని declare చేస్తున్నాను. అందరు లెక్చ

రర్లా లేచి—‘ Congratulations Mr. Satakopam’, అని ముందుకు వెళతాడు

శ: (నిర్ఘాంతపోతాడు.) Dammit !

ప్రి: లేకపోతే, పరీక్షల్లో తప్పుతానని పందెం వేస్తావ్? [అని ముందుకు ఒక అడుగు వేస్తాడు]

లె: (వెంటనే) డబ్బు సంపాదించడం చేతగాక, కట్టిన జీతం తిరిగి యివ్వమంటావ్ ?

హి: కాలేజీ అంటే అల్లాటప్పా అనుకున్నావ్ ?

తె: పెద్దాచిన్నా లేకుండా — నా ముక్కులో నశ్యం వుందంటావ్?

(అని అందరూ అతనిమీద కెళతారు.)

(లెక్చరర్లు ఒక్కోమాట అని ముందుకొస్తుంటే, శఠకోపం ఒక్కొక్క అడుగు వెనక్కొస్తుంటాడు)

అందరూ: ఛొ, ఛడవా ! (అని తరుముతారు) (శఠకోపం ఒక్కగంతువేసి పారిపోతాడు)

ప్రి: Congratulations, my dear members of staff.

స్టా: Congratulations, principal garu !

ప్రి: (గర్వంగా) నా కాలేజీలో Students పరీక్షలు తప్పడమే ?

స్టా: (యింకా గర్వంగా) (మీసాలు తిప్పుతూ)— మేం వుండంగా !

(అంతా పకపకా నవ్వుతారు)

(తెరపడుతుంది)

## పాత్రలు

ఆనందం

అరవిందం

మాలతి

# కోడిపుంజులు

ఆనందం: (ప్రవేశం) యీ అరవిందంగాడితో పెద్ద చిక్కొచ్చిందే! నాకు పెద్ద పోటీగా తయారయ్యాడు. మా మామయ్య కూతురు మాలతితో నేనెప్పుడెక్కడికెళ్ళినా యీ వెధవ ప్రత్యక్షం! శకున పక్షిలాగా ముందన్నా పోతుంటాడు. లేకపోతే కుక్కలాగా వెనకాలైతేనన్నా తయారవుతాడు. నేనూ, మాలతీ సినిమాకెళితే, ఎక్కడ పసిగడతాడో యీ వెధవ తయారు, వచ్చి పక్కనే కూర్చుంటాడు. మేమిద్దరం సరదాగా అలా బీచీకిషికారుకెళితే, అక్కడా యీ పక్షే ప్రత్యక్షం! అదేమిటి, యిదేమిటి, ఎక్కడికన్నాపో యీ శనిగాడు తయారు!...కాని వీడు కాలేజీలో ఆడపిల్లలందరిముందు నన్ను చేసిన పరాభవం మటుకు మరిచిపోలేదు. అది యింకా నాగుండెల్లో రగులుతూనేవుంది, వీడికి తగిన శాస్తిచెయ్యాలి, కాని నేను మటుకు గత విషయమంతా మరచిపోయినట్లే నటించాలి. ఓహ్! అదెంతపని? అరవిందంగాడు మా మాలతిఅంటే పడి చస్తున్నాడు. దానిమీద ప్రేమ గీతాలు గూడా రాస్తున్నాట్ట! కాని దానితో మాట్లాడటానికి దమ్ముల్లేవు వెధవకి! మరోసంగతి! వాడితో పరిచయంలేకపోయినా మా మాలతిగూడ వాడి Personality, వాడి తళుకు బెళుకులు చూచి, వాడిమీద కొంచెం కన్నేసినట్టే కనిపిస్తోంది. యీ సమయంలో మనంగనక కాస్త చెయ్యి చేసుకొని దీన్నిధ్వంసం చేయకపోతే, వీళ్ళిద్దరూ అమాంతం పెళ్ళాడేట్టున్నారు. కాబట్టి కొంచెం తీవ్రంగా ఆలోచించాలి

(ఆలోచిస్తాడు.) ఆ(. బలేప్లాను తట్టిందే! ఆహా! ఆనందం నీ అఖండమైన తెలివితేటలకి హృదయ పూర్వకంగా అభి నందిస్తున్నాను

ఓరీ అరవిందం యిక కాచుకొనుము (దూరంగా అరవిందాన్ని చూచి) అరే వీడు! రానే వచ్చాడే!

అరవిందం! (ప్రవేశించి) (ఆనందాన్ని చూడటండానే, చేతిలోవున్న పూవు నుద్దేశించి, తన్మయత్వంలో మాట్లా డుతుంటాడు) ఆహా! పుష్పమా! నీ అదృష్టమును ఏమని కొనియాడగలను, మాలతీ వినీల కుంతలముల నలంకరిం చిన నీవు నిజముగా ధన్యుడవు! నీమాత్రం Luck నాకు లేక పోయిందే! నీవు ఆమె జడలోంచి జారిపడడం కళ్ళార చూశాను, (ఆశతో) మాలతి వద్దనుంచి నాకేమైనా ప్రేమ సందేశాన్ని గొని తెచ్చితివా? (వాసనచూచి) ఆహా! తుమ్మెదరెక్కల్లాంటి ఆమె నల్లని శిరోజముల పరిమళ మెంత హాయిగనున్నది- (ఆనందాన్ని చూచి) ఆరె! ఆనం దంగాడిక్కడే వున్నాడే! వీడికి నాకు బద్ధవైరం!

ఆనందం! Good Morning అరవిందం! బాగున్నావా!

అరవిందం! (విభ్రాంతపోయి) ఏమిటి? మనపూర్వ విరో ధాన్ని మరిచిపోయావా! నన్ను క్షమించావా?

ఆనందం! ఓ, అంతా మరిచిపోయాను. అయిందేదో అయిపోయింది ఎల్లకాలం పాతకక్షలు పట్టుకుని వ్రా గులాడతానుట్రా భాయీ! నువ్వుకూడా గతం అంతా మరచి పోవాలిసుమా!

అర: ఓ! తప్పకుండాను, యీ క్షణంనుంచి మనమిద్దరం ప్రాణ మిత్రులం! ఏమంటావ్!

ఆనం: అంతకంటేనా?... ఆఁ ఏమిట్రా అరవిందం రోజురోజుకి అలా పాలిపోయి నీరసంగా వుంటున్నావేం యిదివరకు ఎంత చలాకీగా, ఎంత హుషారుగా వుండే వాడివి!

అర: అబ్బే! ఏమీ లేదురా ఏమిలేదు. (తనలో) వీడు నాగుట్టు పసికట్టినట్టున్నాడే!

ఆనం: పోనీలేరా, హుషారుగా వుండు, అదేపనిగా ఆలోచిస్తే మటుకు ఏం ప్రయోజనం కష్టాలు వస్తుంటయ్ మరి! పాపం! నువ్వు

అర: అవున్రా భాయి! నీకు తెలియందేముంది అనుభవం గలవాడివి!

ఆనం: రిజిష్టరు వుత్తరాలుగూడ వస్తున్నయ్యట!

అర: (అనుమానిస్తూ) అవునవును.

ఆన: ప్లీడర్ని పెట్టావా!

అర: (ఆశ్చర్యంతో) ప్లీడరెందుకు? అయినా రిజిష్టరు వుత్తరాలేమిటి!

ఆన: అవున్రా నువ్వు అప్పుల్లో వున్నావనీ, నీ అప్పుల వాళ్ళు....

అర: ఛ! ఛ! అది కాదురా నేనంది.

ఆన: మరేమిటీ నీ నీరసానికికారణం! కొంపదీసి ప్రేమలో పడి కొట్టుకుకోటంలేదుగదా!

అర: (అవునన్నట్టు సిగ్గుతో) అదేరా బ్రదర్!

ఆన: ఏమిటీ! చెప్పవేం!

అర: నే నామెని చాలా ప్రేమిస్తున్నారా!

ఆన: ఎవర్ని!

అర: మీ మామయ్య కూతుర్నిరా!

ఆన. (ఆశ్చర్యంతో) మా మాలతినా! మా మాలతినా!

అర: కోప్పడకు ఆనందం! ఆమెలేకపోతె నే బతకలేను క్షమించు!

ఆన. నువ్వుదాన్ని చేసుకుంటానంటే. నాకెందుకురా కోపం! చేసుకో! మహారాజులాగా చేసుకో! నాకేం అభ్యంతరంలేదు. దాన్నిప్పుడే దానదమన వినిమయ విక్రయాది సర్వహక్కులతో నీకు స్వాధీనం చేస్తున్నా! తీసుకో

అర: (సంతోషంతో) ఆహా! ఆనందం! ఆనందం! నీహృదయం నిజంగా కరుణామృతంలోనిం పిన Tank రా! కాని! అసలు మాలతి ఒప్పుకుంటుందో, లేదో!

ఆన: నిజమేరోయ్, అదీపాయింటే. అయినా, నీకేం భయంలేదు ఆభారమంతా నామీద వదిలెయ్. అంతా నేయేర్పాటు చేస్తా! ఆడదిగాబట్టి సిగ్గువల్ల వెంటనే అనకపోవచ్చు! కాని నిన్నెందుకొప్పుకోదురా? దానిలోవున్న అంత పెద్దలోపాన్నిగూడ లెక్కచేయకుండా నువ్వు దాన్ని ప్రేమిస్తున్నావంటే ,

అర: (ఆశ్చర్యంతో) పెద్దలోపం ఏమిట్రాఅది?

ఆన: నీకుతెలియదా యేమిటి!

అర; నాకేంతెలియదే! ఏమిటో చెప్పరాబాబూ!
ఆన! ఆ( కొంచెం ఆని... (అనిచెవివేపు వేలుపెట్టిచూపు తాడు)
అర: ఏం మతిసరిగా వుందదా! పిచ్చికేక లేస్తుందా!
ఆన; పిచ్చిగాదురాబాబు! చెముడు!
అర! చెముడా?
ఆన: ఆ( పదిపుట్లు మాత్రమే...ఆ(...నువ్వు కొంచెం గొంతు పెద్దదిచేసి మాట్లాడితే చాల్లే!
అర; (నిట్టూర్చి) ఆరి భగవంతుడా! అయినా ప్రయ త్నించి చూస్తాను! ఒరే, ఆనందం! ఆమెకొక పువ్వు Presen$_t$ చెయ్యాలనుకో (కొంచెంగట్టిగా) "ప్రేయసీ యీ ప్రణయ కాన్కను స్వీకరించి, యీ దీనుని తరింప జేయుము" అంటే వినబడుతుందా!
ఆన; మామూలుగానే మాట్లాడితివి! యింకొంచెం గట్టిగా!
ఆర: (కొంచెంగట్టిగా) "ప్రేయసీ! యీప్రణయ కాన్కను స్వీకరించి, యీ దీనుని తరింపజేయుము" యిప్పుడు విన బడుతుందా!
ఆన: (లాభం లేదన్నట్లు తలవూపుతాడు)
అర! (యింకా గట్టిగా "ప్రేయసీ!
ఆన; యింకొంచెం బిగ్గరగా.
అర: (యింకా గట్టిగా) "ప్రేయసీ! యీ ప్రణయ
ఆన; యింకొంచెం!
అర; (గొంతు చిరిగేటట్లు) "ప్రేయసి! యీ ప్రణయి కానుకను స్వీకరించి...

ఆన; ఆఁ, యిప్పుడు కొంచెం వినపడవచ్చు! కాని నువ్వింకా బాగా Practice చెయ్యాలి! (దూరంగామాలతిని చూచి) అదుగో మాలతి యిటే వస్తోంది! నువ్వు కాసేపు ఆప్రక్కకి వెళితేమంచిది, యీ లోపల ఆమెతో మాట్లాడి అంతా ఏర్పాటు చేస్తాను.

అర; ఆలాగే నేగూడా యీలోపల కొంచెం గొంతు Practice చేసుకొంటాను. (అనిపోతూ. " ప్రేయసీ " అంటూ Practice చేసుకొంటూ వెళ్ళిపోతాడు)

(మాలతి ప్రవేశం)

మాలతి; Hallo Good Morning బావా! యిక్కడ ఎవరు గట్టిగా కేకలేస్తున్నారు:

ఆన. ఆఁ. మన అరవిందం పాపం! వాడికి పుట్టెడు చెముడు. వాడిమాట వాడికే వినపడదు. అందుకని గట్టిగా అరుస్తాడు,

మా: ఆలాగా నాకు తెలీదే! ఏం అంతచెముడా?

ఆన; అంతచెముడా?-రాతి గోడనయం! వాడితో కాసేపు మాట్లాడితే మనగొంతులు చిరిగి పోతయ్! దానికి తోడు వాడు పాపం ప్రేమలోపడి కొట్టుకుంటున్నాడు.

మా: ప్రేమ? ఎవరిమీద?

ఆన; ఏం ఎరగనట్టు మాట్లాడుతున్నావే?

మా; అబ్బే, ఒట్టు! నాకేంతెలీదు ఎవరిమీదో చెప్పవ్.

ఆన!..యింకెవరిమీద—నీమీదే!—పైగా, నీతో పరిచయం చెయ్యమని నన్ను పీక్కు తింటున్నాడు,

మా; (ఆలోచించి) యిదుగో బావా! నిజం చెప్పొద్దు! అత నంటే నాకు యిష్టం లేకపోలేదు! యిక చెముడంటావా! కొంచెం కష్టపడి బిగ్గరగా మాట్లాడితే సరిపోదా? యిటు చూడు (గట్టిగా) Good Morning అరవిందం అలా అంటే వినబడుతుందా!

ఆన; అబ్బే! వాడు తిరిగన్నా చూడడు!

మా: (యింకొంచెం గట్టిగా) "Good Morning అర విందం!" యిప్పుడో

ఆన: ఆ(. ఎక్కడో నూతిలో మాట్లాడినట్టు వినపడు తుంది వాడికి,

మా; (గొంతుచించుకొని) "Good Morning"

ఆన; ఆ(. ఆమాత్రమైతే కొంచెం వినపడొచ్చు! అడుగో వాడు యిటే వొస్తున్నాడు. మాలతీ! నువ్వు బిగ్గరగా మాట్లాడాలిసుమా! జాగర్త!

(ప్రవేశం అరవిందం)

ఆన. (చాలా బిగ్గరగా) (అరవిందంతో) యీమె మామా మయ్య కూతురు మాలతి! (మాలతితో గట్టిగా) యితనే అరవిందం!—క్షమించండి! యిప్పుడేవస్తా, అయిదు నిముషాల్లో! (నిష్క్రమించి, ప్రక్కనేవుండి వీళ్ళ తతంగం చూస్తుంటాడు )

అర: (బిగ్గరగా) మాలతీ, యీ పుష్పములను స్వీకరిం పుము ఇవి మా తోటలో పూసినవే!

మా: (అంత బిగ్గరగా) నిజంగా....మీరు...

అర: (తనలో) అనుమానిస్తోంది. అసలు నామాటలు విన బళ్ళేదేమో, కొంపదీసి! (యింకా బిగ్గరగా, మాలతితో) మాలతీ! యీ పుష్పములను స్వీకరింపుము. పుష్పములు మా తోటలోవే;

మాలతి: (గొంతుపెంచి) ఆహా; ఎంత అందంగా వున్నయ్.

అర: (తనలో) అబ్బ: చెవులు బద్దలై పోతున్నయ్‌రా, దేవుడా; (మాలతితో) అవును, మాతోటలోవే; నీకోసమే తెచ్చా;

మా: (తనలో) యిలాగే గంటసేపు మాట్లాడిస్తే వీడు చచ్చి వూరుకుంటాడు. (అతనితో గట్టిగా) మీకు కవిత్వం గూడ వచ్చులాగుందే—కవిత్వం:

అర: (సిగ్గుపడుతూ చిరునవ్వు)

మా: (తనలో) వీడికి వినబడ్డట్టులేదు. యింకా గట్టిగా అరవాలి కాబోలు కవిత్వమండీ; కవిత్వం;—ఒచ్చా?

అర: (తనలో) అబ్బ! దీనికేకలు వింటే చచ్చిన వాళ్లు గూడ లేచివస్తారు: (ఆమెతో, బిగ్గరగా) అవునవును కవిత్వమంటే నాకుచాలా యిష్టం;

(ఆనందం మూరంగావుండి నవ్వుకుంటుంటాడు)

మా: ఏదీ, రెండు పద్యాలు చదవండి;

అర: నాకు ఒకపద్యమేవచ్చు.

"మల్లెపూల తెప్పగట్టి
తెప్పమీద తేలిపోదామా:"